# నిజం



భమిడిపాటి కామేశ్వరరావు




పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# నిజం

భమిడిపాటి కామేశ్వరరావు

విషయములు









పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

అన్ని స్వామ్యములు
గ్రంథకర్తవి

మొదటి ముద్రణం 1930
రెండవ ముద్రణం 1942
మూడవ ముద్రణం 1947

Saraswathi Power Press, Rajahmundry.
Printed and Published by
A. Lakshmana Swamy Naidu
For Addepally & Co, Educational Publishers
Order No. 4303/1947

# పాతబియ్యే! కొత్తబియ్యే!

[19-1-1924 వ తేదీని, రాజమండ్రి ఆర్ట్సు కాలేజీ
పాతవిద్యార్థి సంఘము తరుపున జరిగిన వార్షికోత్సవం
సందర్భంలో, చదివినది.]

సభాధ్యక్షా, సోదరులారా, మిత్రులారా, గురువులారా, నమస్కారము. ఇతరులారా, నమస్కారము. పెందరాళే మొదలెడతాను. మరిలేకపోతే, తరులారా, గిరులారా అనవలసి వస్తుంది. (అంటే, ఆవేళ, సమావేశం చెట్లకింద జరిగింది, ఇది చదవడం వంతు చివరికి వచ్చింది, సభాసదులు అప్పటికి పల్చబడిపోయారు.)

ఈ విద్యార్థిసంఘం పేరట జరుపుతూన్న కళాశాల వార్షికోత్సవ సమయాన్ని రెండు మూడు సంగతులు నేను ఎల్లానూ చెప్పదల్చుకున్నాను గనుక, అవి మీరు శ్రద్ధగా వినరేమో అనేమాట నేను నమ్మను. ఇప్పుడు ముచ్చటించేది బియ్యాలని గురించి—అనగా, పాతవారు; పాతకాపు లని కూడా వాడచ్చును. కొత్తవారు: కోపం రాకుండా వుంటే, కొత్తగిత్తలనచ్చు. ఈ చెప్పే మాటల కన్నింటికీ మూలం చూపించమంటే వీలులేదు పొమ్మండీ, ముందేచెబితే నయం. ఏదో, "విబుధ జనుల వలన విన్నంత కన్నంత", వ్రాయుడంఅయింది. మన హృదయాలన్నిటినీ ఒక్కచోటికి చేర్చి, సర్వసంక్రామకమైన ఆనందంలో కాస్సేపైనా సరే పడేస్తాయేమో చూడడానికి తప్ప

మరెందుకూ కాదు ఈ మాటలు.

సరేనండి, కథలోకి వత్తాం. బియ్యేలని పాతా కొత్తా అని రెండు భాగాలకింద చేశారు, పోనీ చేద్దాం. కొందరు, ఆనకట్టు పూర్వం వారంతా పాతవారనీ, ఆ తరువాత వాళ్లు కొత్త బియ్యే లనీ అన్నారు. మరికొందరు ఏమన్నారా—దంతాలూడిన వాళ్ళంతా పాతవాళ్ళనీన్నీ, (దంతాలు ఎంచేతంటూరా, పళ్ళూడ్డం సాధారణంగనక లెక్కల్లో కట్టుగోడానికి వీల్లేదు లెండి మరి) ఊడని వాళ్ళు కొత్తవాళ్ళనీనీ. ఇంకా కొందరు ఏమన్నారా, తెలుగుతో ప్యాసయినవాళ్ళంతా పాతవాళ్ళనీనీ కడంవాళ్ళు కొత్తవాళ్ళనీనీ. ఈమధ్య మరికొందరు అల్లా కాదు—రిటరిక్ ఉండగా ప్యాసయినవాళ్ళు పాతవాళ్ళనీ, తక్కినవాళ్ళు కొత్తవాళ్ళనీ అన్నారు. కొందరన్నారు: మనమల్నెత్తినవాళ్ళంతా పాతవారూ, అని. దీన్ని కొందరు ఆక్షేపించి పారేశారు. మనమల్నెత్తి బియ్యే ప్యాసయ్యారో బియ్యే ప్యాసయి మనమల్నెత్తారో ఎల్లాగేమిటి తేలడం? అని. కొంతకొంతమంది సకృతుగా పాతవారితో బయలు దేరి కొత్తవారితో ప్యాసయ్యారు, భోజనానికి నాన్నతో కూచుని అమ్మతో లేచినట్టు. వీర్ని ఎందులో వెయ్యాలో ఆలోచించవలసిన విషయమే! పోనీలెండి, "పాతక్రొత్తలేమిటికి మనుష్యులకు"; వారూ సోదరులే గనక, ఆసంగతి వార్నే అడుగుదాం "పాతయముడివా, కొత్త యముడివా" అని.

విభజనా అంటే త్రాహి త్రాహి అవుతోంది కాని, ఈ

రెండుపక్షాలకీ తేడా చాలా ఉంది స్మండీ. ఘాటంగా ఉంది.

పాతవారు డిటెయిల్డ్ బియ్యేలు. కొత్తవారు నాన్ డిటెయిల్డ్ బియ్యేలు. టెయిల్ మాత్రం ఇద్దరికీ ఉంది. పాతవారు ప్యాసైనప్పుడు బియ్యే అంటే ఇంకా కొత్తగా ఊరుకునేది. సిపాయి మ్యూటినీ సంవత్సరం కాకినాడలో ఒకాయన బియ్యేప్యాసవగా ఆయన్ని ప్రతీవాడూ బియ్యేగారూ అంటూ హెచ్చరించడమే కాదు, మేనాలో కూచోబెట్టి ఊరేగించారట. ఈకాలంలో, బియ్యేలు ఊరేగించే వాళ్లు లేక ఉద్యోగాలకోసం తమరే ఊరేగుతున్నారు. వెనకటి బియ్యేలకి సంసార గోష్ఠి ఉండేది. ఇప్పుడు, బియ్యేలు మామగారు హెచ్చు తగ్గుగా మాట్లాడితే పెళ్ళాన్ని వదిలి పెట్టేస్తారు; పెళ్ళానికి చదువు తక్కువని తమరు బియ్యే ప్యాసవడంతోటే వదిలిపెడుతున్నారు, అసలు. పాతబియ్యేలు కట్నాలు పుచ్చుగునే పెళ్ళిళ్లు చేసుగున్నారు. కొత్తబియ్యేలు కూడా కొంతవరకు పుచ్చుగున్నారు కాని వ్యాపారం అప్పుడే ఎదురుతిరిగిపోతోంది. ఏమంటే, ఇప్పుడు పెళ్ళిబేరాల్లో వరుడి తాలూకు నేలా, తోటా, రొక్కనగదూ, జవాహిరీ, ఇవన్నీ కళ్ళతో చూచి మరీ తాంబూలా లిస్తున్నారు. అప్పట్లో కుర్రాడే సమస్తమున్నూ. వెనకటి వాళ్ళు వేషభాషలకి శాస్త్రం జం కేవారు. పాతబియ్యేలు జుట్టు పంచపాళీలాగ చేయించడమే గొప్ప. తమ పిలక ఛేదించడం తమ తల్లిదండ్రులకి శిరచ్ఛేదం అనుకునేవారుట. ఇంటిదగ్గర, వాళ్లు, తెలుగే మాట్లాడేవారుట.

కాని, కొత్తబిర్యో బోడిగుండు అయితీరాలి. కాకపోతే వాడికి సివిలిజేషన్ లేదని అయినవాళ్ళు ఏడిపిస్తారు! ఆమధ్య బిర్యోలు, మీసాలు సమూలంగా లాగించేసేవారు, కాని కొందరు కొత్త బిర్యోలు, అదేదో స్కాచ్ సాంప్రదాయంట, ముక్కుకింద ఒక్కొక్క పెడ లెక్క నాలుగేసి పరకలు చొప్పున మాత్రం అట్టే పెడుతున్నారు. ఈ సభలోనే ఉన్నారేమో, ఒకవేళ అట్టివారు. - వారికి ఏమీ ఫర్వాలేదు, ఎగ్జెంప్షన్ ఇచ్చేద్దాం. కొత్త బిర్యోలలో శతికర్ర లేనివారూ, సిగరెట్టు పెదవులతో కాల్చనివారూ అరుదు. వీలయితే, ఒక "చేలా" ని కూడా ఈడ్చుకుపోతూ, వాడితోటి, తమకి ఎంతమంది నమస్కారాలు పెడుతున్నారో, తిమర్ని "ఏమండీ" అని ఎంతమంది అంటున్నారో చెబుతూంటారు. కొత్తవాళ్ళకి రిఫరెన్సులు ఎక్కువ. పాతబిర్యోలు విస్తారంగా వట్టిభట్టీ పద్దులుట. హిస్టరీ, జాగ్రఫీ, ఇంగ్లీషు దేశీలూ గళగ్రాహిగా వచ్చేటట్టు వాళ్ళు కవిత్వాలుకూడా చేసుగుని వల్లెవేసి అట్టే పెట్టుగునే వారట; తమకు తెలిసే ఉండ వచ్చు!

నసత్ర హేస్టింగ్స్ నఅపాచ వాలీస్
నవత్రి జాన్‌షోర్ నసప్త సింగ్టర్,
అనూప బార్లో అనూస మింటో
అయ్రేత్రి మోయ్‌రా అద్వాత్రి అమ్హరెస్ట్.

(ఏ-అంటే ఒకటి, ద్వా-అంటే రెండూ చొప్పున తొమ్మిది దాకా చూసుగుని, సూ-అంటే సున్నా అనుకుని, అన్నింటికీ

ముందు ఒకటి చేరుస్తూంటే ఈప్రభువుల పరిపాలన సంవత్స రాలు చక్కా వస్తాయి.)

ఇటీవల ఒకాయన ఇంగ్లీషుపాఠం తెలుగుపద్యంగా మార్చి జ్ఞాపకం ఉంచుగున్నాడట:

ఉ॥ రామ ది కింగ్సు సన్ను వితు లక్ష్మణా యండ్వితు సీత వెంటు ట్రూ ఫేమసు దండకాను బిగుఫీల్డ్సు......

అవునా, తెలుగు సంస్కృతాలో విశేషప్రజ్ఞ ఉండడంవల్ల వాళ్ళు అల్లా ఎక్కువ చేసుకునే వారు ధారణ. కొత్తబిచ్యేలకి సంస్కృతప్రాకృతాలు గ్రీకేండ్ లాటిన్, తెలుగులో గుణింతాలే చాలాముందికి రావు. ఊఁ, పాపం పైవారు వద్దయ్యా పోన్ పొమ్మన్నారు. ఇక, సంస్కృతం మాట్లాడ్డం అనేది బూతులకి గౌరవనీయ ప్రయోగంగా అంటూంటారు "సంస్కృతం వద్దు, తిన్నగా మాట్లాడు," అని. ఇంటిదగ్గిఅకూడా ఇంగ్లీషు. కాదు, అన్నట్టు, ఇంటిదగ్గిరే ఇంగ్లీషు. అన్నం వడ్డిస్తూంటేకూడా కొందరు ఇనఫ్ దట్ వుల్ డూ, దట్ వుల్ డూ! అంటూంటారు. ఏమన్నా అంటే, తమరికి ఇంగ్లీషులోకి మల్లే తెలుగులో నెళ్ళదంటారు, జిహ్వ కలంకూడాను. కాని, దీనికితగ్గట్టు ఒక్కొక్కకొత్తబిచ్యే అనర్గళంగా తెలుగులో కవిత్వం చెబుతూంటాడు. కొంతకొంత ఇంగ్లీషు వచ్చిన తెలుగువాడికి కొరుకు బడుతుంది. ఆ తక్కింది ఏం వచ్చినా సరే తెలియను. తెలిస్తే మజాలేదు; అందుకనే అచ్చేసి పారెయ్యాలని కొందరు.

సరి, పాత వారు సంపాదనలలో గట్టివారు. కొత్తబిచ్యేలు

ఖర్చు పెట్టడానికి మార్గాలు నేర్చుకుని సిద్ధంగా ఉండే ఘనులు! పాతబియ్యేలకి అంతా శబ్దప్రమాణమే. చదివిందీ, చెప్పిందీ, నమ్మేశేవారు. చాలా ప్రయోగాలు బ్లాక్ బోర్డుమీద చూసే వారు. కొత్తవారికి అంతా అనుమానంకాదు, అంతా ప్రత్యక్షమే. పాతబియ్యేలు తమరు మూఢులనీ, చెప్పేవారు గొప్పవారనీ నమ్మకంతో చదివినవాళ్ళు. కొత్తబియ్యేలు తమంతవారు లేరనీ, చెప్పేవాడు మూఢుడనీ దూసుకుపోయే సుడివల్ల ప్యాసై తనమీదికి కొట్టుగొచ్చాడనీ విశ్వాసంతో చదివినవాళ్లు! ఎక్కడికేనా వెడితే పాతబియ్యేలకి సీట్లు రిజర్వుడు; కొత్తబియ్యేలకి బారావఖుకుం. కొత్తబియ్యేలు స్వనాపితులు—సెల్ఫ్; పాతవారు పరతంత్రులు! పాతబియ్యే మితవాది; కొత్తబియ్యే అతివాది లేకపోతే స్వాతంత్ర్యవాది. పాతబియ్యేది మెరకపంట (అనగా, పోపుల పెట్టె) అతడు జాక్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్. కొత్తబియ్యేది లంక పంట (అనగానున్నా ఒకటే పట్టుగుని చదివెయ్యడం) పాతబియ్యేలు చాలామట్టుకు కలిసి వెళ్ళి చిట్టచివరకి చీలిపోయేవారు. కొత్తవారు మొదటే చీలిపోయి బయలు దేరుతున్నారు. పాతబియ్యేలు, తద్దినాలు తిథులు చూసుగుని పెట్టేవారట. కొత్తబియ్యే వీలయితే తద్దినం పెట్టనేపెట్టడు. మరీ వీలు లేకపస్తే, సరియైన క్రీస్తుశకం చూసుగుని పెడతాడు. (లేకపోతే పెద్దస్కేలు మీద వేసంగి సెలవల్లో పెడతాడు.) వెనకటివాళ్ళు తర్పణాలు నీళ్ళతో వొదిలేవారు. కొత్తబియ్యేలు, ఉదయం కాఫీ సాయంత్రం టీ,

జుహోమిస్వాహా అంటారు. పాతబియ్యేలకి గణ్యత సమానంగా ఉండేది. కొత్తబియ్యేలకి గణ్యత, చదివిన శాస్త్రాన్ని బట్టి వస్తోంది. డబుల్ డికాంపొజిషన్ లాంటి ద్వివిఘటన మార్పులు చేయగల సైన్సు బియ్యే సమర్థుడు. ప్రతివాళ్ళకీ వాంటెడ్! పారమార్థిక చింతలో పరిశ్రమ చేసే ఫిలాసఫీ బియ్యే వట్టి వోబయ్య, ఎవ్వరికీ అక్కర్లేదు (ఒకాయన చెప్పినట్టు డోన్ట్ వాంటెడ్!) అందుకనే, "ఏను ఇంతాచేసి కేవలం ఫిలాసఫీ గ్రాడ్యుయేట్‌లా ఉన్నానేమిరా! అనేమాట నిల్చిపోయింది. పాతబియ్యేలు ఫౌంటెన్‌పెన్లు ఎరగరట. కొత్తవారు అవీ ఎరుగుదురు, "దస్తూరీ స్వహస్తం" కూడా ఎరుగుదురు. పాతవారు దెబ్బలాటవస్తే ఓ కొమ్ముకాసి కావలిస్తే ఓ తడాఖా తీసేవారుట. కొత్త బియ్యేలు, చిలిపిజట్టీలూ వెకిలిఅల్లరీలూ అగుతారు కాని చేయి చేసుకోరు. కొత్తబియ్యేలు వినయవిధేయతలతో చదువుకుని ప్యాసై పదవడి అధికారులైనవాళ్ళు. కొత్తబియ్యేలు, పామరత్వంగల పండితులమీద అధికారం ముందే ఛలాయిస్తూ చదివిప్యాసయిం తరవాత తమరు ఎక్కడా చలామణీ కాకపోవడం అనుభవించి అప్పుడు వినయ విధేయతలు తెచ్చిపెట్టుకుంటున్నారు. కొత్తవారు చందాలు పైలాపచ్చీస్‌గా వేస్తారు, పాతవారు సణుగుతూ ఇస్తారు. కొత్తవారికి, "నాకు తెలుగులో మొదణ్ణించీ టేస్ట్ లేదండీ" అనిచెప్పుకోడం ఫాషన్. పాతబియ్యేలు సాలుకి రెండు పరీక్షలు ఎరగరు. కొత్తవాళ్ళు సాలుకి

రెండు పరీక్షలు చూస్తున్నారు. ముందువాళ్ళు మూడు కోరతారేమో అనుమానం. వెనకటి వాళ్ళకి పరీక్షప్రశ్నలు చెప్పేసేవారుట, పంతుళ్ళు. ఈ బియ్యేలు డబ్బెట్టి కొనుక్కో-వలసి వస్తోంది. కాబట్టి, వెనక, ప్రశ్నలు కొందరికే ముట్టేవి ఇప్పుడు అందరికీ ముట్టచ్చు. వెనకటిబియ్యేలు రాత్రి చదవకుండా తెల్లవారుఝామున చదివి ప్యాసయారు. కొత్తవారు రాత్రిల్లాచదివి ఫేలవుతారు. వెనకటివాళ్ళది చల్లనిచదువు, తరవాణ్ణి బ్రాండ్. కొత్తబియ్యేలది ఘాటు చదువు, లిప్టన్ బ్రాండ్ కాంకాకిల్లీ బ్రాండ్, లేకపోతే సిజర్సుమార్కు! పాతబియ్యేలకి ధారణబలం ఎక్కువ, కొత్తవాళ్ళకి ప్రతిబంధకబలం ఎక్కువ! పాతబియ్యేలు మూలం చదివి హానిహానిగా విమర్శ చేసే నేర్పు మొకణ్ణించీ సంపాదిస్తున్నారు! అందుకని వీరిలోకొందరు—కొందరేమిటి మళ్ళా నెల్లిమాట—అందరూ కూడా ఒరిజినలే, కాదు ఏబోరిజినలే. పాతబియ్యేలు ఖాళీగా ఉండడం ఎరగరు. కొత్తబియ్యేలకి అంతా ఖాళీయే. చదువుకున్న వాళ్ళల్లో నిరుద్యోగస్థితి గురించి ఆలోచించవలసిన బాధ్యత పాతబియ్యేలది, వారుకొంచెం గట్టున ఉన్నారుగనక.

ఇల్లాంటిచిహ్నాలు వీరివాళ్ళల్లో ఉన్నా అంతాఒకచోటే కోవా గనక అందరూ కలుసుకోడానికీ, కాలం కలిసి గడపడానికీ, ఏర్పాట్లు చెయ్యవలసింది. ఇప్పుడీ ఊళ్ళో తప్ప ఈసమావేశం సంగతి తక్కినవారికి తెలియనే తెలియదు. ముందు శరీరం గనక ఒక్కభోజనమైనా ఏర్పాటు చేయవలసింది. (ఆ తర

వాతే ఇదిచేశారు.)

పాతబిడ్యోలు కొత్తవారి సమస్య మనస్సులో పెట్టుకుని వారికి ముక్తిమార్గం చూపించాలి. కొత్తవాళ్ళు, అర్య ధర్మాలూ, హిందూమతం, తెలుగుభాషా లాంటివాటికీ, ఈ పాటికీ, కొంచెం దుమ్ముదులిపి, మనం ఎవరమో ఆనవాలు కూడా కాస్త వెనక్కి తిరిగి చూసుకోవలసిన తరుణం వచ్చిందేమో, మరి! నమస్కారం.

---

# "బోధనాపద్ధతులు"

[19-3-1927 వ తేదీని రాజమండ్రీ బోధనకాలేజీలో ఉపాధ్యాయ సంఘ వార్షికోత్సవ సందర్భంలో చదివిన వ్యాసం.]

"బోధించడం" అంటే ఒక తెలిసినవాడు ఒక తెలియని వాణ్ణి దగ్గిర కూర్చోబెట్టుగుని, ఒకకొత్తవిషయం పట్టుగొచ్చి అది అరటిపండు ఒలిచినట్టు చెప్పి, "చెప్పాను, నావని అయింది" అని ఊరుకోవడం కాదు; వాడిచేత "హాం" అనిపించి "అదా! తెలిసిందండి" అనిపించడం. అనగా బోధనలో ఉపాధ్యాయుడూ, విషయం, విద్యార్థీ ముగ్గురుండాలి; కాని ఈ ముగ్గురూ కాక మరొక పదార్థం ఉంటేనేగాని బోధనక్రియ నెరవేరదని జ్ఞానుల ఊహ. అదేమిటంటే, విద్యార్థి అయినవాడికి చెప్పేవాడి యందుండవలసిన ఒక భావం. విద్యార్థికి మేష్టరంటే "హడల్" ఉన్నా సరే—యముడ్రావీడు, తప్పట్టుగుని చంపేస్తాడ్రా—అని. "భయం" ఉన్నా సరే—యమకింకరుడురా వీడు, అదేతన్నడం తన్ని బాదిస్తాడేమో—అని. "భక్తి" ఉన్నా సిరే—సృష్టించిన దేవుడ్రా, నేను మొక్కాలీ—అని. "విశ్వాసం" ఉన్నా సరే—యజమానుడురా, నేను సేవించాలీ—అని. "నమ్మకం" ఉన్నా సరే—జ్ఞానిరా, నేను ఆశ్రయించాలీ—అని. "గౌరవం" ఉన్నా సరే—అనుభవశాలిరా నేను వినాలీ—అని. పోనీ "స్నేహం" ఉన్నా సరే—సహవాసిరా, నేను తిరస్కరించనా—అని. ఆఖరికి "సిగ్గుబిడియాలు",

ఉన్నా సరే—అవతల మేష్టరికి రాకపోవడం అనుమానం అయినా, నాకు రాకపోవడం రూఢిగదా—అని. ఆలాంటి భావం ఉన్నన్నినాళ్ళు మేష్టరులో ఉండేది చదువు; మేష్టరు యందు గురుత్వం ఉండేది. ఆతరవాతనించి కుర్రాడిలో నేగురుత్వం ప్రవేశించింది. అనగా, అప్పటిదాకా విద్యార్థి విద్య అర్థించే వాడు, అకస్మాత్తుగా ఆ అర్థించడం మానుకున్నాడు. మ్మానుకుని "విద్యకోసం మరి నేను బయలుదేర్ను. అంత అవసరంగా ఉంటే విద్యనే నాదగ్గిరికి రమ్మనండి. నాకేంపట్టింది ? కావ లిస్తే ఏమన్నా మధ్యవర్తులకి నాలుగురాళ్ళు గిరవాటెడతాను" అని బిగిసి కూర్చున్నాడు. అయితేంగాక, అతడు అర్థించక పోయినాసరే "మేంమాత్రం మాకొచ్చింది బోధించక మానం" అని అనేక కారణాలవల్ల ఉపాధ్యాయులు విద్యార్థిని పట్టుగు న్నారు; ఆలోచించారు. "ఆఁ ఏమిరా ఇదీ. కుర్రాడు ఇల్లా వినిపించుగోకుండా వచ్చాడు; వీడికి కల్మషం లేదే! వీడు దేవుడు. వీడి మనస్సు కనిపెట్టాలి. ఇన్నాళ్ళ నించీ ద్రోహంచేసి వీణ్ణి కేవలం కుర్రాడి కింద కట్టి చదువు తెగచెప్పి నగ్గుకుపోతున్నారు కొందరు. అల్లాంటి అన్యాయం జరగకుండా కట్టుదిట్టం చెయ్యాలి" అని స్థిరపరిచారు. "కుర్రాడికి తెలియక పోవడానికి కారణం కుర్రాడు కాదు, మేష్టరుగారి తెలివితక్కువ" అన్నారు. అంతటితో మరి మెదడు వెనక్కిపట్టి మెథడ్ తియ్యమన్నారు.

ఆపళంగా బోధనాపద్ధతులు వెలిశాయి. ఉపాధ్యాయుడు తనకి ఉత్సాహం మహా వచ్చును గదా అని విశేషాలు గబగబా అదే వాగుడుకింద ఊరికే చెప్పి పారెయ్యకూడ దన్నారు. సంగతులకి కొత్తంటూ ఏముంది? ప్రతీ సంగతీకూడానున్నూ కుర్రాడి బుర్రకాయలోనే ఇదివరకే ఏ మూలో దాగుడుమూచ్చిలు ఆడుతూ ఉంటుంది. అది ఎక్కడుంటుందో వెతికి బయటికి లాగడం పూచీ మేష్టరిది అన్నారు—ఇదే ఎలిసిటింగ్ మెథడ్ అంటారు. కొందరు "కుర్రాడికి ఏదో కొంత లంచం యిచ్చి బెల్లించాలి; లేకపోతే చదవడు" అన్నారు. కొందరు వాడు ఏం కావాలంటే అది చెప్పమన్నారు. వాడేమీ వద్దంటే ఊరుకోవడమే విద్య అన్నారు. వాడు ఎప్పుడు, ఏది, ఎంత వరకు కోరితే అప్పుడే, అదే, అంతవరకే కానీ మన్నారు. వాడి బుర్రగుంజుని అంటిపెట్టుకుని కొన్ని గొప్ప లక్షణాలు ఉంటాయి; వాటికి ఓ పట్టకారు పట్టించి ఇవతలికి పెల్లగించడమే "ఎడ్యుకేషను" అంటే అని, ప్రతీ మనిషీ లెక్చరివ్వగలడు. ఇల్లాగ్గా ఒక్కొక్క కొత్తఉత్సాహంతో, వెనకటి పద్ధతుల్లో లోట్లు తమను పూడిచాం అని ఎవరిమట్టుకు వారు చెబుతూ, ఒక్కొక్కటి చొప్పున, అనేకమైన నవీనబోధనా పద్ధతులు బయలుదేరదీశారు! దాంతోటి ఏం జరిగింది? జీవం ఉన్న మాష్టర్ని వదిలేసి లేచిపోయిన గురుత్వం జీవం ఉన్న కుర్రాణ్ణీ ఆశ్రయించలేదు. కుర్రాడు మైనరుగదా అని గావును—ఆ గురుత్వం ఇప్పుడు జీవంలేని మెథడ్ని నమ్ముకుని ఉంది. ఆ మెథడ్- మహా

దేవతనే అందరూ కొలుస్తున్నారు.

ఎల్లానో అల్లాఅంతా మెథడ్ స్మరణే. మతాల్లో ఉండే కక్షలు, వృత్తుల్లో ఉండే అభిమానం, భాషల్లో ఉండే అసహ్యాలు మెథడ్లలో ఉన్నాయి. ఏమనిషి మంచివాడో నిర్ణయించచ్చు; చివరికి ఏగడియారం రైటో తేల్చచ్చుగాని ఏమెథడ్ మంచిదో చెప్పలేం. ఈ మెథడ్ మంచిదా ఆ మెథడ్ మంచిదా అనే చర్చ అసలు కూడదు. వెనక ఓ కవి వైదీకా, నియోగా అని మీమాంస వచ్చింది. సరి, ఓ వైదీకిగారు కవి వైదీకే అని వాదించి పదిహేను దృష్టాంతరాలు చూపించాడు. తక్షణం, ఒక నియోగిగారు బయలుదేరి కవి నియోగే అని ఇరవైచోట్ల ఋజువులున్నాయి గ్రంథవిస్తర భీతిచే ఆగుతున్నానన్నాడు. ఆంధ్రసాహిత్య విమర్శలో గొప్ప వాదన విషయాలు ఏమంటే ఇదీ, కాలనిర్ణయమూనూ. చివరికి ఓ ఆసామీ చక్కావచ్చి, ఆ కవి నియోగీకాడు వైదికీకాడు, అసలు బ్రాహ్మడే కాడు వల్లకాడు, అబ్రహ్మణ్యుడని చెప్పి పూర్తిగా సిద్ధాంతం చేశాడు. అందుకని మంచి మెథడ్ మాట అటుంచి ఎవరేనా వచ్చి ఇవి మెథడ్లే కావంటే! చాహాలి. కాని, కొందరు మెథడ్లు అంటే తమరికి ఇష్టం లేదంటూ మెథడ్లు ఉపయోగిస్తారు; ఏమీ బాగుండ లేదు, కాస్త వంకాయకూర ఇల్లా వడ్డించండి అన్నట్టు. మరికొందరు, మెథడ్ని ద్వేషించినా అది నిరర్థకం అని శాసన చెయ్యడానికిట ఉపయోగిస్తూన్నది; చుట్ట కాల్చడం ఎందుకయ్యా అంటే

పోగాకంటే నాకు ద్వేషం కనపడ్డ చోటల్లా దాని మొహం తగలేస్తున్నాను అన్నట్టు. చాలామంది మెథడ్ అవలంబించి ఫలితం శూన్యం అయితే మెథడ్ తప్పంటారు; టెన్నిసులో పాయింటు పాడుచేసి బాట్ కేసి చూచి మొహం చిట్లించినట్టు. చేసేటట్టు చేస్తే ప్రతీ మెథడూ మంచిదే అని కొందరు. తమరి మెథడే మెథడని కొందరు.

పూర్వం బోధనకి పద్ధతులంటూ వినం. ఆచరణలో కొన్ని రీతులున్నా, అవి పేరు మోసిన పేర్లతో లేవు. కాబట్టి మనమే వాటికి కొన్ని పేర్లెట్టాలి. మొదట "దెబ్బ దేవేంద్రలోకం" మెథడ్, అనగా "తెలిసిందా, తెలిసిందా లేదా; తెలిసిందను, అను" అసి తెలిసేవరకు కొట్టడం. తరువాత, "పాడుంపట్టు" మెథడ్. అనగా బొటనవేలూ చూపుడు వేలూ కలిపి పట్టు గుని—"అయొక్క శ్రీరామచంద్రులవారు ఏమన్నారూ?" అంటూ సభక్తికంగా చెప్పడం. ఆపైని "వాయినం" మెథడ్: మేష్టరు "గివ్" చేస్తూంటే విద్యార్థి "టేక్" చేస్తూండడం, "ఇస్తినమ్మా వాయినం" అంటే, "పుచ్చుకుంటినమ్మా వాయినం" అన్నట్టు. ఒకవేళ విద్యార్థికి ఇష్టంలేకపోయినా "గివ్" చేస్తే, కూరడం లక్షణం ఉంది కనక "కాయావకాయ్" అనేష్వంటి "గన్ పౌడర్" మెథడ్ అవుతుంది. అక్కణ్ణించి "ఫెయిర్" మెథడ్ ఉండేది—అనగా సంతకింద పాఠం చెప్పడం. ఆ తరవాత, "వడ్డీమంగలి" మెథడ్, అంటే శిష్యుడు కాళ్ళు పిసుకుతూంటే గురువు పాఠం చెప్పడం.

వీటిల్లో "ఊఁ మెథడ్" అని ఒకటుంది. ఓ తాసిల్దారు గారు తమరి అబ్బాయిని "నాలుగుమూళ్ళెంత ?" అని అడిగితే అతను కాయితం ఉంటేనే గాని తేలదని అది పుచ్చుకుని దానిమీద "2" అని వేశాట్ట. తాసిల్దారు గారికి కోపం వచ్చి తనూరింటో ప్రైవేటు ట్యూషన్ మనిషికి కబురంపించి, "ఏమిటయ్యా నీ చెప్పా ? నాల్గుగు మూళ్లైనా రాదే మావాడికి !" అన్నాట్ట. అంటే మేష్టరు ."ఇదివరకు పదిసార్లు చెప్పానండి, రెండు మూడుసార్లుగాదు, (అని కుర్రాడి కేసి చూసి పళ్ళు బిగించి) పది; కాని దానికి మెథడ్ ఉందిలెండి మీరెరగరు. చూడండి నే తీస్తాను సమాధానం. నాలుగు మూళ్ళెంతోయ్ !"

అ—పది ! (అని మూలుగుతాడు).

మే—ఊఁ.

అ—పదకొండు !

మే—(మరీ ఘట్టిగా) ఊఁ,

అ—పన్నెండు !

మే—(ఒహాటు దీర్ఘంగా తాపీగా) ఊఁ...

తా—మరి, మీ రైతే ఇప్పుడు ఇల్లా చెప్పించారుగాని, ఇందాకా వాడేసిన "రెండు" తప్పుకాదూ ?

మే—కాదండి. ఈ ప్రశ్నకి రెండాన్సర్లున్నాయి. మీఅబ్బాయి "2" ఎందు కేశాడో తెలిసిందా ? నాలుగు మూళ్ళు రెండు గజాలు గదా అని. కాదు టోయ్ ?

అ—మరేనండి ?

మే—ఊఁ.

ఇదికూడా ఒకజాతి "ఎలిసిటింగ్ మెథడ్." ఇంకా "ఫింగర్ అండ్ సేక్రెడ్ త్రెడ్ మెథడ్" (వేళ్ళతో దంధ్యం మెలెయ్యడం —మరా:—దంధ్యం ఉంటే మాటే), "వాల్ చైర్ మెథడ్" (అనగా గోడకుర్చీ మెథడ్) లాంటివి ఉన్నాయి కాని మనం ఇక ఇటీవలి పద్ధతులలో పడదాం.

మొదట సొక్రటిక్ మెథడ్; అనగా డూడూ బసవన్న మెథడ్. మేష్టరు "కాన్స్ట్రా" అంటే విద్యార్థి "అవునండీ, ఒట్టు, అంతేనండి" అంటాడు. అప్పుడే వెంటనే మేష్టరు "అవునా!" అంటే "కాదండి, ఒట్టు" అంటాడు. కుర్రాడు "యెస్" "నో"లే ప్రయోగించేది. వెనకటికి "యెస్, నో ఆల్ రైట్" వచ్చిన ఒకాయన దొరగారితో మాట్లాడానికి వెడితే దొరగారు మొదట ప్రశ్న "మీ వూరికి మెద్రాస్ ఎంత" అని వేశాట్ట. వేస్తే ఆయన "నో" ప్రయోగించాట్ట. దొరకి తెలిసి, "నీకు జాతిభాష రాదుగావున్ను" అన్నాట్ట, మనవాడు "యెస్" అన్నాట్ట. అక్కడితో దొరకి విసుగెత్తి "నీవు ఫూల్ లా ఉన్నావే" అన్నాట్ట. "ఆల్ రైట్" విసిరి మనవాడు చక్కాపోయాట్ట. అల్లాంటిదే కొశ్చెన్ మెథడ్. వీటిల్లో మాష్టరుకి బాగా వస్తుంది పాఠం. తరువాత కొన్నాళ్ళకి ఒక డైరెక్టరు అనే దొర ఒక మెథడ్ కనిపెట్టాడు. అదే డైరెక్టు మెథడ్. తెలియని భాష నేర్చుకోవాలంటే తెలియకుండా మాట్లాడుతూంటేగాని బాగా తెలియదన్నారు వీరు. ఈయనికి ఏజెంటు ఫొనెటిక్స్ అనేదొర. ఈదొర ఊరుకోపేరు, ఒక్కొక్క

మనిషి దగ్గిర ఓ వేషం వేసేసరికి ఈన అసలు నామరూపాలు పోయాయి. చిన్నప్పుడు ఈన బాగానే ఉంటూను గాని, చూపులకి నూ అనవ్వాం. ఎవరిష్టం వారిది ఈమన్ని పిలవడం లో. ఒక యజమాని మేష్టర్ని ఇల్లా ఆశ్రయించాట్ట-"మా కుర్రాడిమీద ఆ బ్యూటిక్కు దొరగారికి కోపంట. తమరు చెప్పి కొంచెం కూడతీద్దురూ!" అని. అక్కణ్ణించి "రియలిస్టు" అనే మరో దొర—దొరేమిటంటే, ఇంగ్లీషు ఊరు పేరు, దేశం పేరు, పర్వతం పేరు, జంతువు, పక్షి, మనిషి ఇవన్నీ దొరగార్లే మనకి—ఒక మెథడ్ స్థాపించాడు. ఇదికొంత ప్రబలింది! ఓ మేష్టారు పిల్లి బాపడ రియలిస్టిక్ మెథడ్ ప్రకారం "ఐడియల్" గా పాఠం చెబుదామని, ఒక పిల్లిని క్లాసులోకి పట్టికెళ్ళాడు. వదిలితే అది బల్లమీద పడి కొందర్ని రక్కి, కడంవాళ్ళని గుప్పిటికి చేతిలో పెట్టడానికి సిద్ధమైందట. పదపడి ఒకాయన "కాంక్రీట్" మెథడ్ కనిపెట్టాడు. రోడ్డు కాంక్రీట్ ఈయనకి సంబంధం తేలేటట్టుగా ముందుముందు శాసనం దొరకచ్చు, ఓ పంతులు దీని ప్రకారం పాఠం చెబుతున్నాడు. "ఐ టాక్" అన్నాడు. అని, అన్నదల్లా చెయ్యాలిగా, సరి మాట్లాడాడు. ఇదివరకునించీ మాట్లాడుతూండడంవల్ల కొత్తగా అప్పుడేం చేశాడో కుర్రాళ్ళకి బోధపడలేదు. "ఐ సింగ్" అన్నాడు, అని పాడాడు. "ఐ లాఫ్" అన్నాడు. అని నవ్వాడు. "ఐ క్రై" అన్నాడు, అని పాపం, ఏడిచాడు. "ఐ డై" అన్నాడు. అని పాఠం ఆగి పోయిందని తరవాత హెడ్ మాస్టరుగారు కోప్పడ

శారని గావును అంతటితో ఊరుకున్నాడు. పోనుపోను ఒకతను "ఓరిజనల్" మెథడ్ చేశాడు. కొండలమీద పాఠం అయితే అంతా కొండెక్కాలి. గోదావరిమీద అయితే అంతా కట్టకట్టుగుని గోదావరిలో దిగాలి. గాలిమీద పాఠం అయితే అంతా గాలిలోకి ఎగరాలి. ఇది రమారమి "ఎయిరీ" మెథడ్. ఈలోపున "సైన్సు" దొరగారు ఒక మెథడ్ సృష్టించాడు. ఇందులో ఒక్కటే వచ్చింది చిక్కు. ప్రతీవాడూ తన ఆయుర్దాయం సాగ గొట్టించుగుని, తెలివి తేటలు చెక్కించుగుని రావలసివచ్చింది. ఈస్థితిలో ఒక "లేబర్" పక్షం మనిషీ, ఒక "టోరీ" పక్షం వాడూ జాయింటు సమతంచేసి "లేబరేటరీ" మెథడ్ కనిపెట్టారు. బాగా కృషి చెయ్యాలి, డబ్బు విపరీతంగా ఉండాలి, అదెట్టి కర్రా కంపా సామగ్రీ కొని తయారుచేసి ఉంచితే, ప్రతీవాడూ అందులో పడి కొట్టుగుని కొన్నాళ్ళకి ఏదో కనిపెట్టలేక పోడన్నారు. కాని ఇంకో ఇద్దరు తలెత్తారు: "డిడక్షన్" దొర "ఇండక్షన్" దొర అనే కవలపిల్లలు. ఎవరెవరో పోల్చడం మాకష్టం. లోపల కూర్చుని వచ్చానంటూను మొదటాయన. వచ్చాను, లోపల చిక్కడ్డాను అంటూను రెండోఆయన. వీరు చెరోవేపూ నడిచి, చివరికి రాజీపడి, "ప్రొడక్టివ్" మెథడ్ ఒక్కటి మాత్రం స్థాపించారట. ఇల్లా ఉండగా "హ్యూరీ" అనే మరొక దొరగారు బయలుదేరారు. ఆయన చరిత్ర వ్రాసిన "బ్యాకీ" అనే దొరకి మేనమామ అయినట్లు మా స్వకీయవిలేఖరి వ్రాస్తున్నాడు!

ఈయన, తక్కువామిటి– "నేనే కనిపెట్టా, నేనే కనిపెట్టా," నంటూ ఒకమెథడ్ నెలకొల్పాడు. అదే "హ్యూరిస్టిక్" మెథడ్ అయింది. ఈ పద్ధతిప్రకారం విద్య స్వకపోల కల్పితం. పదపడి "కిండర్ గార్టెన్", బయలుదేరింది. అనగా మేష్టర్ని "తోటమాలి" పని చెయ్యమన్నారు. మొక్కలతిండి మొక్కలకి తెలుసులెండి, అన్నారు. ఆమెట్టున ఒకదొరసాని వ్యక్తిత్వం సంపాదించడానికి ప్రతిబాలుడికీ స్వేచ్ఛ యింకా కావాలి, చాలను అని విచారించి, ఒక "సారి" మెథడ్ పెట్టింది. అదే "మోంటిసోరి" మెథడ్. ఇందులో కుర్రాడు ఏమంటే అదేవేదం: వాడు మేష్టర్ని నోరు మూసుగోమంటే మేష్టరు అంతేచెయ్యాలి. లేకపోతే వాడిమనస్సు పాడై చదువు రాదన్నారు. కాని ప్రతీమెథడ్‌లోకి మల్లేనే అందులోనూ, చెప్పిన వాటిల్లోచాలా షరతులు పాటించక్కర్లేదుట. కాలక్రమాన్ని డాల్టన్ దొరగారి మెథడ్‌వచ్చింది: ఇందులో మేష్టరు చెప్పకుండా చెప్పాలి. విద్యార్థికి బాధ్యతా, పట్టుదలా, ఓర్పూ ఉండి, చేతినిండా డబ్బూ, బీరువాలనిండా కొత్తపుస్తకాలూ ఉంటే ఇహానేమీ అక్కర్లేదు పొమ్మన్నారు. ఒక చోట ఈమెథడ్ నడుపుతూ, ఒకకుర్రవాడికి ఒకకూడిక లెక్క ఎస్సైన్‌మెంటు ఇచ్చారు. ఆ అబ్బాయి లెక్కతప్పాడు. మేష్టరు "రూపాయల్లో తప్పావు, మళ్ళీ చెయ్యి" అని మళ్ళీ అదే ఇచ్చాడు. ఆ అబ్బాయి మళ్ళీ తప్పాడు. మేష్టరు "పైసలుతప్పు. మళ్ళీచెయ్యి" అన్నాడు. కుర్రాడు "ఎంత

తప్పండి" అని అడిగాడు. ఆయన 6 పైసలు తక్కువొచ్చిందని చెప్పాడు. చెపితే "ఆ ఆరుపైసలూ నేను తనకి దాఖలు చేస్తాను ఈ లెక్క మాత్రం నావల్ల కాదండి" అన్నాట్ట ఆ అబ్బాయి. ఇందులో కుర్రాణ్ణి పెద్దలు నమ్మాలి. అతను నమ్మించి ఎగేయొచ్చు. కేష్టరూ తనకి పనిలేదని బైటాయించవచ్చు. దాని తరవాత "ప్రాజెక్టు" దొర బయలుదేరాడు. ఆ పేరుకే సవాలక్ష గ్రంథం ఉంది. కుర్రాణ్ణి మూలమూలలకూ లాగించి సంఘంలోకీ, జీవితంలోకీ ఈదమంటారు వీరు. జీవితంలో సమస్య ఓటి కుర్రాడు తలపెట్టుగుని, దానిమూలస్థానమైన అశంగుకెళ్ళిపోయి ఆ సమస్య నిర్వహించెయ్యడానికి కావలసిన శాస్త్ర భాగాలు నేర్చేసుగుని సొంతంగా పనిచెయ్యమంటారు. అనగా ఇది "తత్సంబంధం" మెథడ్, లేక "హాండుపోర్డు అండ్ మర్టన్" మెథడ్. వీరూ గొప్పవాళ్ళని పెట్టి కుర్రాడికి మళ్ళీ చెప్పించమంటారు డాల్టన్ప్లాన్లోకి! ఇది పెద్ద వాళ్ళకయితే పర్వా లేదు గాని, కుర్రాళ్ళు దారీ తెన్నూ లేకుండా మహారణ్యంలో పడిపోతారేమో అని కొందరి బెంగ. ఇందులో స్త్రీవిద్య అంటే గృహకృత్యం నేర్చుకోడమేట. అందుకని ఈ దేశపు స్త్రీలకి ప్రస్తుతం ఇది రుచించదు. ఆపైని, "గేరీ" దొరగారు తను యథాశక్తి చంపా పాకేశారు—అదే గేరీ కంట్రిబ్యూషన్. పిల్లల్ని వదలద్దు. పని–ఆట–చదువు అన్నీ స్కూల్లోనే జరగాలి. మంచి పౌరుల్ని తయారుచెయ్యాలి. తల్లితండ్రుల్ని వచ్చిపిల్లలతో కలిసి అప్పుడప్పుడు స్కూల్లోనే పని చెయ్య

మన్నారు. కాని మన దేశంలో తండ్రి తమరి అబ్బాయి ఫేలయి-నప్పుడుగాని స్కూలు కాంపౌండు తొక్కడు! తల్లి తనపిల్లాడికి బూతులు రావని వాదిస్తుంది గాని, అవి తమవాడు ఎంత పరిశుభ్రంగా వాడతాడో ఎరగదు, వినదు. వీరికి "గేరీ" చెప్పింది నచ్చకపోవచ్చు. తరువాత "ఆటా, పాటా, తమాషా" మెథడ్ అనగా "ప్లే, వే" మెథడ్. అందులో భాగమే "స్కౌటింగ్" అన్నారు. నాటకాలుకూడా ఆడనుంటారు వీరు. మన దేశంలో అన్నిందాలా పాడైపోయినవాడుగాని నాటకంలో వేషం కూడదని అభిప్రాయమాయిరి! అందుకని, ఇదీ మనకి నచ్చకపోవచ్చు!

ఇందాకణ్ణించీ అనుకున్నవి, ఐశ్వర్యంతో తుల తూగుతూ, చల్లగా ఉండి, స్వంతరాజ్యం ఉండి, మావాళ్ళు విద్యావంతులై ప్రపంచం ఏలాలి అనే దేశాల్లో మెథడ్ల మాటలు! కాని, మన దేశం!— మన దేశంలో విద్యాపోషణ అనేటప్పటికి,— చెయ్యి, కాలు, నాలిక అన్నీ వెనక్కి లాగేస్తాయి (ఒక్కనాడి తప్ప). అల్లా దరిద్రం వెళ్ళబోసుకుంటూండి, వేడిప్రదేశమై ఉండి, విద్యానాథులెవరో తేలకుండా, నానాజాతులూ, నానావర్ణాలూ నానాభాషలూ గల నావానాహేబులు నలభై యేసి (పైవారి ఒప్పుదలమీద యాభై యేసి) మంది అజ్ఞానులు ఉన్న తరగతులు— ఒకటవ, రెండవ, మూడవ, నాల్గవ సంవత్సరం ఆ తరగతే ఎందుకురా, ఇదీ అని ఉసూరున ఈడుస్తూండే పిల్లలుగల తరగతులు—మార్కుల పెంట, పరీక్షల గొడవ, ప్యాసుల ఆదుర్దా, గుమస్తాగిరీ పరమావధీ గల తరగతులు—

చొక్కాలు విప్పితే ఎముకల పోగులుగా ఉండి, ఆత్మికవిద్య లేక, సౌశీల్యం ఏర్పడడానికి నోచుకోక, గంట కిర్రున మేష్టర్నిచూసే పిల్లలుగల తరగతులు—స్వభాషకి దూరాన్నిపడి అన్యభాష అందుకోడానికి అర్హతలేని పిల్లలు గల తరగతులు—ఉంటూన్న ఈ దేశంలో ఏ మెథడ్ పెట్టి చెబితే బోధన జరుగుతుందో తెలుసుగోడం మాటలు కాదు. డబ్బిచిమ్మి, తెలివిగల వాణ్ణి పెట్టి, తెలివి గలవాడికి చెప్పమంటే "అవసరం ఎక్కడ కుదురుతుంది? ఉన్నదాల్లోనే ఏదో కాస్త నెత్తిమీద చమురెట్టి అయింది అనిపించాలి, ఏంజేస్తాం?" అంటారు కొందరు. ఈదేశం మేష్టరు అందుచేత, అన్నీ కలిపేసి మహోత్కృష్టం మెథడ్ అవలంబించాలి! నవీనమైన మెథడ్లు ఎరుగుండడం మంచిది. అవి "బియిడి" పరీక్షలో పనికొస్తాయి. ఇంత సైకాలజీ, ఇన్ని మెథడ్‌లూ ఉంటేనేగాని అర్థం తెలియని ఆన్సర్లు పరీక్షలో రాయడానికి వీలుండదు. అది ఒకటి, రెండోది, మీరు ముందు ముందు ఇన్‌స్పెక్టరుగా వెడితే ఆ చెప్పేవిషయం మీకు తెలియకపోయినా మెథడ్‌ని, మేష్టర్నీ విమర్శించి పారెయ్యొచ్చు, ప్రతీమెథడ్‌లోనూ మంచి ఉంటుంది. అది ప్రతీవాడూ పుచ్చుకుని, డబ్బు ఖర్చులేనంతమట్టుకి ఆచరిస్తేనరి మనదేశం లో. ఏమెథడైతేం క్రియముఖ్య కుర్రాడికి తెలియడం ప్రధానంట. అల్లాయితే మొట్టమొదటి కొచ్చాం. ఏముక్కతో చాలా పూర్వులు బయలుదేరారో ఆముక్కదగ్గిరికే మనం మెథడ్ వీధులంట తిరిగి తిరిగి వస్తున్నాం! సెలవ్.

—

# అద్దెకొంపలు

ఒకరి తాలూకు కొంప, మరియొకరు, ఆ ఒకరికి అసహ్యం వేసిన తక్షణం ఖాళీచేయుగల పద్ధతిని, తాత్కాలికంగా, అసలుకి మోసంరాకుండా వాడుకుంటూ, అట్లా కొంప వాడుకుంటూన్నందుకుగాను పరస్పరప్రకారం ఆ ఒకరికి (అనగా కొంపయజమానికి) నెలనెలా రొక్కరూపేణా "ఇంత" అని దాఖలు చెయ్యవలసిన ప్రతిఫలం ఉందే, దాన్నే, "అద్దె" అంటారు. దీన్నే కొందరు (తెలుగువాళ్ళే) "బాడుగ" అంటారు. అననీండి. "అద్దె" అనడంకంటె "బాడుగ" పాడుగా లేదు. అట్టిసందర్భంలో, ఆ కొంపకి "అద్దెకొంప" అనీ, ఇచ్చిన వాడికి "అద్దెయజమాని" లేక "ఇంటి ఆయన" అనీ, పుచ్చుకున్నవాడికి "అద్దెకున్నాయన" లేక "అద్దెకొచ్చినాయన" లేక "కాపరం ఉన్నవారు" అనీ చెప్పుకుంటారు. ఆస్తియొక్క దాన విక్రయాలు అద్దెతో పోల్చిచూడగా దానంలో, దాత ప్రతిఫలం కోరడు (కొందరు కీర్తి కోరి తీరతారు), ప్రతిగ్రహీత ఎల్లకాలమూ వాడుకుంటాడు. విక్రయంలో, అమ్మేవాడు ప్రతిఫలం తింటూను, కొనేవాడు ఎల్లకాలమూ అనుభవిస్తాడు (పేచీలు లేకుండా ఉంటే!); కాని అద్దెవిషయంలో, యజమాని ప్రతిఫలం లాగుతూంటాడు, అద్దెకున్నవాడు తాత్కాలికంగా ఉంటూంటాడు. హక్కువారిదీ, భుక్తంవీడిదీ !

హయాంశకంతో బయలుదేరిన ఉద్యోగాలల్లో సర్దుకుంటో

చ్చిన వారికి కారణాంతరాలవల్ల బదిలాయింపులు మామూలైతె గ్రామాంతరవాసం తప్పనిసరి అవుతోచ్చినప్పణ్ణించీ "అద్దె కొంపలు" అనేటటువంటివి జనించి ఉంటాయి. ఇట్టివి బస్తీలలో విరివిగానూ, పల్లెల్లో సకృత్తుగానూ వెలవడం సహజం. ఏదేనా ఊరికి ఓ కొత్త కోర్టుగాని, అడిషనల్ కోర్టుగాని, పాతతీర్థం గాని, పుష్కరంగాని, మరి ఏదో ఒక ముఖ్యసంస్థగాని వచ్చే కాలమే అద్దెకొంపలకి చిత్త. అటువంటప్పుడు, అదివరదాకా ఒకరికి చాలీచాలకుండా ఉంటూన్న ఇల్లు, వారికే తెగ యెక్కువైపోయి ఊరుకుంటుంది. అమట్టున, వారు, ఆ ఉన్న దా ల్లోనే కొంత అద్దెభాగంకింద కేటాయిస్తారు (తమ మేలు కోరే వాళ్లు కూడ చేసిన మాడట). కాబట్టి, కొన్నికొన్ని పుట్టుకచేత అద్దెకొంపలుగా కూర్చినవి; కొన్నికొన్ని పెంపకంచేతనే అద్దె కొంపల లిస్టులో చేర్చినవి; కొన్నికొన్ని బలిమిచేత అద్దెకొంప లుగా మార్చినవి. ఆంగ్లవిద్య చేర్చిన వాళ్ళల్లో చాలామందికి జన్మస్థానం పల్లెటూరైనా, ఉద్యోగస్థానం బస్తీయే అవుతూం టుంది. వార్ని, ప్రయాణాల్లో, ఎవరేనా, "తమ దేవూరు?" అని ప్రశ్నిస్తే, పైరెండింటిల్లోనూ ఎందుకో అందుకు ఎక్కువ ప్రసిద్ధికెక్కిన ఊరుంటుందే అదే తమదని చెప్పేసి దాటుగు పోతూంటారు. ఏమయితేం! ఒక ఊళ్ళో కొంప పాడు. దాన్ని చూస్తే వారికి మంట. గృహాభిమానం అట్లా చచ్చినప్పుడు, గ్రామాభిమానం కూడా ఎట్లా చస్తుందో చెప్పొచ్చు. కాని తద్వారా దేశాభిమానం కూడా చావకుండా ఎట్లా ఉంటుందో

ఋజువు చెయ్యటమంటే మాత్రం కష్టం. అల్లాంటివాళ్ళు బస్తీల్లో అద్దెకొంపకి మేతవేసి, పల్లెటూరిలో స్వంతకొంపకి కడుపు ప్రమాణం స్తూంటారు. ఆ పల్లెకొంపల్లో ఎవరేనా కుదురుకుని తీవరికి అద్దె కట్టిచెప్పాలని కాదు వారు అపేక్షించేది! ఎవరేనా ఉండి దీపం పెట్టుగుంటే చాలని! అదీ కాదు! కొందరు, ఆ దీపం నిమిత్తం స్వంతఖర్చుమీద కోతి మార్కు కిరసనాయిలు డబ్బాకూడా (ఉండగలవారికి) సప్లయిచేసే వాళ్ళుకూడా ఉంటోచ్చారు. కాని, అనేక డిపార్టుమెంటుల ఉద్యోగాలు ఇప్పుడు పల్లెటి దిక్కునకూడా ఆవిర్భవించడంవల్ల పైస్థితి కొంచెం తిరగబడి అక్కడ సమేతూ అద్దెలు వస్తూనే ఉన్నాయి, కటీవల. అదీగాక, పొలాలవల్ల రాబడి అనేది విస్తారం ఎండకి ఎండి వానకి తడిసి మాసిగలు పడ్డమీదట సాలుకి ఓసారి (మహాఅయితే రెండుసార్లు) వస్తే రావచ్చు అనే శాపతుది అవడంచేతనున్నూ, అద్దె అనేది సునాయాసంగా, నెల నెలా, నమ్మకంగా వచ్చేది అవడంచేతనున్నూ, అద్దెమీద జనానికి మోహం ఎక్కువై, "పల్లెటూర్లో పాతిక ఎకరాలు ఉండేకంటే బస్తీలో నాళ్ళనడాన్ని మాంచి మొగలో ఒక్క అద్దెకొంపఉంటే చాలదుషోయ్ ?" అనే అభిప్రాయం బాగా వేళ్ళుబారింది. అక్కణ్ణించి "వీరికి సాలుకి ఓ వంద బస్తా సిరాటంకంగా వస్తుంది" అనిపించుకోడంకంటె "వీరికి అద్దెలవల్ల సాలుకి ఓ వంద వస్తుందట!" అనిపించుగోడమే పెద్దమనిషి తరహాకి లక్షణం అయింది.

ఎట్లా అయితేం, అద్దెకి మోజు ఎక్కువై, అన్నింటితో పాటు అదికూడా ఒక "ఫాషన్" అయింది. అనగా, ప్రతీదీ నెలకి, రోజుకి, క్షణానికి కూడా అద్దెకివ్వడం సాగించారు. మార్వాడీ డబ్బుగాని నగలుగాని అద్దెకిస్తాడు. చాకలి బట్టలు అద్దెకిస్తాడు. వారస్త్రీ శరీరం అద్దెకిస్తుంది. కార్మికుడు కరచరణాలు అద్దెకిస్తాడు. లాయరు తెలివి తేటలు అద్దెకిస్తాడు డాక్టరు ఆరోగ్యం అద్దెకిస్తాడు ఉపాధ్యాయుడు తెలియుడం అద్దెకిస్తాడు. గవ్నలపు ఉద్యోగి మనస్సు అద్దెకిస్తాడు. మంగలి శూన్యత్వం అద్దెకిస్తాడు. వాహనం వేగం అద్దెకిస్తుంది. ఇల్లాగ్గా సర్వత్రా అద్దె వ్యాపించి ఉంది. కాబట్టి, కొంప అద్దెకివ్వడంలో విడ్డూర్యం బొత్తిగా లేదు. కొందరు గడవక, కొందరు మొహమాటం చొప్పున, కొందరు ఒక్కరూ ఉండలేక, కొందరు దురాలోచనతో, కొందరు దూరాలోచనతో, కొందరు సంక్రమించిన ఆస్తిలో కొంత ఊరికే ఉండిపోడం ఎందుకని, కొందరు పాటివాళ్ళు ఇస్తూంటే తమరు తీసిపోవడేం అనీ, లాంటి అనేక కారణాలవల్ల యజమానులు కొంపలు అద్దెకిస్తూంటారు. ఒకడు తనవర్ణంవాడికి గాని ఇవ్వడు. ఒకడు తనశాఖవాడికే ఇస్తాడు. ఒకడు బ్రహ్మచారికిగాని ఇవ్వడు. ఒక్కొక్కడు డిస్ట్రిక్టు మునసబులకే ఇస్తాడు (సరిహద్దు గోడ కేసులు, స్వంతా నివి, చాలాఉండి) ఒక్కొక్కడు పోలీసువారికి గాని ఇవ్వడు (తను ప్రతీవాడి మీదా ఎగరచ్చునని, మహా!) ఒకొక్కడు గృహస్థుకిగాని ఇవ్వడు. సాధారణంగా ఎవరూ

కూడా తమ బంధువులకి యివ్వరు (సంసారపు గుట్లు బయలు పడతాయనీ, భోజనానికీ దానికీ పిలుస్తూండాలనీ, మొత్తంమీద కొంత ఎడం ఎందుకేనా మంచిదనీ)! ఏమైనా సరేగాని, అద్దెకొచ్చినవాడు తేగలపాతరపంతానం వాడయితే, ఎంతశాంతుడైన యజమానికైనా సరే అరికాలిమంట నెత్తి కెక్కుతుంది. (కొంప నిలువునామీద ధ్వంసధూళి చేస్తారని)! అందుచేత, ఏకపుత్రుడో లేక దత్తుడో అయిన పెళ్ళి కుమారుణ్ణి చూస్తే కన్యాదాతకి పథ్యమైనట్టు, అన్నహితవులేని నెల భోక్తని చూస్తే హూటలు మేనేజరుకి ప్రాణమైనట్టు, పాడీపంటగని తడిగల ఇస్తోకసంసారం అద్దెకొస్తున్నారంటే, ఇంటివారు ఎగిరి గంతేస్తారు. అందులో ఆ అద్దెకువచ్చేవాడు ఇరుపార్శ్వాలా "నా" అన్నవాడు లేనివాడయితే ఇంటివారికి మరీయిష్టం. ఒకవేళ ఉన్నా, మాటలుగాని, చూపులుగాని, భోయినాలుగాని ఇవి ఏమీ గాని లేనివారయినా చాలు.

అవసరం కలగగానే, తలదాచుకునేటందుకు స్థలం దొరికితే చాలని, జనం ఘోటుఘోటు మంటూ కొంపలకోసం తిరుగుతారు. "అద్దెకివ్వబడును" అని కట్టిఉన్నవీ లేనివీకూడా తణిఖీచేస్తారు. వాటి యజమానుల్ని పట్టుకుంటారు. వ్యవహారం చొప్పైన యజమానులు తమ అద్దెభాగంయొక్క శ్రేష్ఠతా, సౌకర్యమూ, హంగూవగైరాలగురించి ఒక సంభీరోపన్యాసం ఇచ్చి, లోగడ అది ఖాళీచేసినవాడియొక్క చెడ్డతనం, లోట్లూ పిసినిగొట్టుతనం పేచీకోరు స్వభావంగురించి

(ఎవరెల్లాంటివారైతే మనకేంగాని అంటూనే) విస్తారం ముచ్చటించి, ప్రస్తుతం అద్దెకొచ్చినవారితో ఏదో బాదరాయణ సంబంధం అతుకు సమర్థించి, తమయొక్క స్వార్థత్యాగమూ, జనాన్నిగూర్చి తాము పడుతూన్న పాట్లూ, అద్దెలకివ్వడంవల్ల తమకుండే నష్టాలూ, వాటిని తాము లెక్కచెయ్యక పోనీ ఎవరో పరాయివాళ్లు సుఖిస్తారుగదా అదే తమకూ కోరేదని, తాము ఈవ్యాపారంలోకి దిగడమూ, గురించి కొన్ని డబ్బీలు కోసి, అద్దెకొచ్చినవాణ్ణి గగరాయింపజేస్తారు. దాంతోటి ఆ వచ్చిన వాడు, కడుపునిండి, ముస్తాబుచేసిన అవకరపుపిల్లయొక్క పై మెరుగుచూసి తాంబూలాలు పుచ్చుకున్నట్టు—అడ్వాన్సు పారేసి చేరేస్తాడు; కాని, కాపరం చేసిచూసిన మీదటగాని కిమామిషు పూర్తిగా తేల్తూండదు. కొన్నాళ్లు నివాసంచేసరికి ఒక్కొక్క అద్దె కొంపయొక్క ప్రత్యేకపు చిక్కులు అద్దెకున్నవారికి నాటి, జీర్ణించి, కల్యాగతం అవుతాయి.

అదిలగాయితు అద్దెకున్న వాళ్ళల్లో సణుగుడు బయల్దేరుతుంది. పాటివాళ్ళంతా చేరి చిక్కులు వెళ్ళబోసుగుంటూంటారు. "మాభాగం దివ్యంగానే ఉంటుందికాని, వీధికి ఫర్లాంగుదూరం దీంతగలెయ్యా! ఛస్తే కేక అందదు. రాత్రెళ్ళప్పుడు చావే" అని ఒకరు. "మాభాగం చందుగా పెట్టెలాగ కుదిమట్టంగా ఉంటుందికాని, ఒక్కటొచ్చింది: స్త్రీలకి ఇబ్బంది వచ్చినప్పుడు-మా చెడ్డ ఇబ్బంది. వీధులోంచి చుట్టుతిరిగి దొడ్లోకి వెళ్ళాలి." అని ఒకసంసారి. "మాకు దొంగభయం దొమ్మభయం లేవు

గాని, ఖర్చుపడ్డ జనాభా యావత్తూ మా గుమ్మంలోంచే నడవడం" అని ఒక ఓఘాయిత్యాడు. "మాకొంపకి మెట్టుకి రోగంటగాని, వానాకాలం మాత్రం నరకం. కాస్త సంయుక్తాగ్ర గుడం కూడా ఉండదు—గోడ్డుమీదాంచి కొంపలో నడడానికి" అని ఒక నారాయణరావు. "మా ఇల్లు మహా ఎక్కా ఇల్లు! కానయితేం, దొడ్డి బహుకుశలం. ఒక్కొక్కరే వెళ్ళాలి, రావాలి!" అని ఒక కుసుమయ్య. "మా ఇల్లు మాత్రం తీసిపోయిం టటగాని, ఒక్కటే లోటు! గాలిరాదు. రాకపోతే పీడా పోయింది. ఇదివరకే ఉండేమో అంటే దీపం ఆర్పడానికికూడా లేదు." అని ఒక అంజనేయులు. "మా వాటా పెద్దదే. అనడం, కాని, అనేక మాట్లు నించిచూస్తాను, పురుళ్ళకి ఇంతా అంతా కాదుకద చిక్కు!" అని ఒక బ్రహ్మయ్య. "మా ఇల్లు ఫస్టు. కాని కొంపకి చుట్టం వచ్చేసరికి ఇంటాయన పెళ్ళానికిమంట. స్నానానికి వెళ్ళి నూతిదగ్గర చేదితో నీళ్లు పోసుకుని రెండోచేద తీసేసరికి యజమానివచ్చి చేద అటకాయిస్తాడు—నీళ్లు నిధులో కడితే వస్తా అంటుంటుందిట" అని ఒక కూర్మయ్య. "మునిసిపాలిటీ పన్ను హెచ్చినప్పుడుకూడా మా ఇంటి అద్దె హెచ్చుతూనే ఉంటుంది" అని ఒక వ్యాపారి. కొంపలు ఇతరులవి గనక ఇలాగంటి లోట్లుమాత్రమే చెప్పగుంటూ, ఆ అద్దెకే అంతకంటె మంచికొంప దొరికితే లేచిపోదామని వీరూ, ఆ కొంపమీదే (దమ్మిడీ ముకమ్మైనా లేకుండా, ఉన్న వారిని పొమ్మని, వచ్చే కొత్తవారిదగ్గర) మరి నాలుగు

రూపాయలు లాగాలని యజమానులూ తీవ్రయత్నాలు చేస్తూనే ఉంటారు. కర్మవాదన ధర్మమూ అని ఉన్నస్థితికే సరిపుచ్చుగుని దేవుళ్ళాడుతూంటారు.

అద్దెలకి ఉండేవారిని నాలుగుభాగాలు చెయ్యొచ్చు అనగా అల్పాలు మినహాయించగా, వీరు నాలుగు రకాల కిందికి వస్తారు. మొదటిరకం: ఇంటివారు పరోక్షమందుండగా, యావత్తుకొంపలోనూ ఉండే ఏకకుటుంబం. వీరిది స్వారాజ్యం. వీరి అరచెయ్యి దుర్భిణీకింద పెడితే, రేఖలు గోచరించి తీరతాయి. కొద్ది మరమ్మతు వగైరా చేయించడానికి ఇంటివారు రానడానికి వీల్లేక అద్దెకింద చెల్లురాసి వీరే ఇంటిబాగు చూసుకుంటారు. గృహం పరులదే అయినా పెద్దమరమ్మతు అగత్యమో, అద్దెలో పెంపకమో వచ్చేవరకూ నైదికానికి కూడా వీరు "స్వగృహే" అనేటట్టు ఉంటారు.

రెండోరకం: ఇంటివారు పరోక్షమందుండగా, మధ్య ఉమ్మడి హాలుగల రెండు సమాన వాటాలలో ఉంటూండే రెండు వేరు సంసారాలవాళ్లు. చేరిన కొన్నాళ్ళు వీరు క్షీరనీర న్యాయంగా ఉంటారు. వారిలో ఒకవాటా ఆవిడ గడుసుదీ రెండో వాటా ఆవిడ మెత్తబడీగనక అయినా, మొదటి ఆవిడ రెండో ఆవిణ్ణి కీలు బొమ్మనిజేసి, ఆడించి, దానిచేత చాకిరీ చేయించుకుని, దాని యిల్లు ఓ కడకి తెస్తుంది. ఇది అరుదు. సాధారణంగా జరిగే రీతివేరు. ఓ వాటాలో జనం తక్కువ ఉంటారు. ఆ అద్దెకే, సమానవాటా అయిన రెండోదాల్లో

ఎక్కువ ఉంటారు. ఎక్కువవారు తక్కువవార్ని తోసుకొస్తారు. అల్లాంటప్పుడే యుద్ధాలు జరగడం. ఎటొచ్చీ కొన్ని యుద్ధాలు చిన్నవి, కొన్ని పెద్దవి. ఉమ్మడిస్థలం ఇద్దరూ వాడుకుంటారు గాని ఎవరూ తుడవరు. ఒక వేళ తుడిస్తే, ఇద్దర్లోనూ లౌక్యం ఎవరు ఎరగరో వాళ్లు తుడుస్తారు. ఉమ్మడిహాలు తమరొక్కరే వాడుకోవాలని ఇద్దరూ ప్లాను వేస్తుంటారు. ఓ ఇంటికి బంధువులొస్తే, వారు ఆ బంధువులకి ఉమ్మడిహాలులోనే విడిది యిస్తారు. రెండో వాటావాడు, ఉమ్మడిహాలుమీద తనహక్కు నాశనం అయిపోతుందని పెళ్ళాంతో కూడబలుక్కుని, తన ఆలోచనలు మానుకొని తనకూడా ఓచాప తన పక్క వేసుకుని పెద్దపనున్నట్టు ఎదో రికార్డు ముందేసుకుని సృష్టిలో లేనికాగితం వెతుకుతూంటాడు. ఓ వాటావాడు ఉమ్మడి హాలులో ఏ తిరగలో రోలో పెట్టుకుంటే, రెండో వాడు ఏ నులకమంచమో, పిడకలతట్టో అరువేనా తెచ్చి పెట్టించి మరోపని చూసుకుంటాడు. "మాపక్క వాటా వాడికి అయిదారుగురు ఆడజనం ఉండడంవల్ల, ఒకరు విడిచి ఒకరు, నెలపోడుగునా, ఉమ్మడిహాల్లో బైఠా యిస్తారు. నా కర్మదశవల్ల ఇంట్లో ఒక్కర్తే అవడంవల్ల ఉమ్మడిహాలు వాళ్ళకే ధారాదత్తం అయింది" అని ఒకొక్క వాటా ఆయన బాధపడుతూంటాడు. కొంతకాలం జరిగింతరవాత ఓరెంటో ఏ తద్దినమో అయినప్పుడు, రెండో వాటా ఆయన అప్పాచీల వంటి స్నేహితుల్ని తీసుకొచ్చి సిగరెట్టుపొగతో ధుమధుమ

లాడుతూ ఉన్మాది హాలులో ప్రసంగిస్తూంటాడు. రాత్రేళ్ళు వీరివేపున వారూ, వారివేపున వీరూ లఘు, గురు, మరి ఇతర మైన శంకలు తీర్చుగుంటూండడం, ఉదయాన్నే లేచి ఆ కాశ రామన్న మీాదపెట్టి ఒకర్ని ఒకరు అక్షులూ పక్షులూ రాల తిట్టుగోడం. స్వతస్సిద్ధంగా చేతుల్లోఉండే వామువు జిబ్బో, లేక మనస్సులోఉండే ఇతర తెగులో కాని, వీలునుబట్టి పుల్లిస్తరాకులు • అవతల వాటాస్థలంలో వెయ్యాలనే ప్రతీవాళ్ళూ చూడడం. ఒకచోట, రాత్రి ఎనిమిదిగంటలవేళ, ఒకవాటా ఆయన "లంకాదహనం" చేస్తూ అరుగుమీాద కూర్చుని ఉండ గానే రెండోవాటా ఆవిడవచ్చి, ఊరంత పుల్లిస్తరాకుల మోపుతెచ్చి మొదటివాటాకి ఎదురుగుండా దిబ్బున గిరవ పెట్టగా,

ఆయన—చెట్టంతమనిషిని ఇక్కడ ఉంటూండగానే ఏమి టమ్మా ఆ పనీ?

ఆవిడ—ఏం లేదండీ! మాయింటో భోయినాలు అయినాయి, పుల్లిస్తరాకులు.

ఆయన—ఆ మాట నాకూ తెలును, మా వేపునేనా మీారు వెయ్యవలసింది?

ఆవిడ—ఏం జెయ్యమన్నారు?

ఆయన—సిగ్గు లేదుటమ్మా! మీా వేపున వేసుగోలేరూ?—

ఆవిడ—మాకు మైలగదా మరీ, మా వేపు నల్లా వేసు గోడం, మైల విస్తళ్ళు?

ఆయన—అదోటా? ఎంత రౌతువమ్మా!

అనేసరికి ఆవిడ గొల్లున రాగాలెట్టి, (ఇది స్త్రీ యొక్క ద్వితీయాస్త్రంగా మరి!) రెండోవాటా వచ్చినాడు, ఆడవాళ్ళ వ్యాపారాలలోకి జొరబడి, తనఘోషా చెడగొట్టి, తనని అనవచ్చినమాటా అనరానిమాటా అని నానాగోలా ఎత్తించాడని ముగుసుగారికి రిపోర్టు చేసే సరికి, వాడూ భేతాళుడల్లా వచ్చి "మావాళ్ళతో ఏమిట్రా సేలావ్, మా విస్త్రళ్ళగోల నీకెందుకురా? పుంఢాకోర్! చూడు, నీ ఉద్యోగం లాగించేస్తాను అని ఆయనమీద కలియబడగా మేజస్ట్రీటంత పనిజరిగి, జనం వచ్చి వారిని విడదీసేసరికి కోడికూసింది.

మూడోరకం! ఈ రకంకూడా యజమానులు పరోక్షమందు ఉండేదే. అయితే దీల్లో మూడు చిల్లరి రకాలున్నాయి. ప్రథమం! నానా సంసారాలవాళ్ళు గూడు పురాణీలా ఉండే ఒక అద్దెకొంపల గుత్తిలోనో, లేక పోలీసు లయినులా ఉండే అద్దెకొంపల మాలలోనో ఉండేవారు. వీటికినొడ్డి, పాకీదొడ్డి నుయ్యిలాంటివి ఉమ్మడి. దొడ్డికి మరుగు ఉండక స్త్రీలు బాధపడతారు, పాకీదొడ్డివగ్గర ఉదయం అయిదు లగాయితు సుమారు ఏడువరకూ నూరుగజాలపోటీ పందెంలాంటివి జరుగుతూండడంవల్ల రద్దీ ఎక్కువ. నూతిప్రాంతాలకి పగటి భాగంలో మొగాళ్లు వెళ్ళరాదు. ద్వితీయం! పైనిచెప్పినలాంటి వాటిల్లోనే బ్రహ్మచారులు (తగుచు విద్యార్థులు) గాని, తాత్కాలిక బ్రహ్మచారులుగాని ఉండడం. ఇందులో ధూమస్తంభ నిర్మా

గం జరుగుతూంటుంది. "టీ" పానం ఉంటుంది. కిల్లీ ఉమ్ముల అసహ్యం కనిపిస్తుంది. నాజూకు చేతిగొలుసులు, సిల్కుకండువాలు, మనీపర్సులు లాంటివి స్వతహా జడపదార్థాలైనా ఎగిరి పోతూంటాయి. కొత్తరిష్టువాచీలు తిప్పకుండా తిరుగు తూంటాయి. గనక, నడుస్తూంటాయి! తృతీయం! పైనిచెప్పిన లాంటి వాటిల్లోనే కొన్నివాటాల్లో సంసారులూ, కొన్నింటిల్లో తాత్కాలిక బ్రహ్మచారులూ కలగలుపుగా ఉండేవి. వీటిల్లో, చెప్పేదేముంది? జాబులూ, నిట్టూర్పులూ, రేపులమాపులూ మాపులరేపులూ లాంటివి ఉంటాయి.

ఇక నాలుగోరకం! ఢిల్లీలో, ఇంటివారు ఒకవాటాలో ఉండగా, వారి దివ్యసముఖమందు, తక్కిన వాటాల్లో అద్దె కొచ్చిన వాళ్ళుంటారు. ఇల్లా ఉండడం అద్దెకివెళ్ళేవాడి సాహసానికి పరమావధి. అద్దెకవెళ్ళే వాడికి ఇది కత్తిమీద సాము. పులితో చెలగాట. ఇంటి వారి ఉద్దేశం తమరు పాలకులమనీ, ఇవతలవాళ్లు పాలితులనీ; తమరి హృదయం విశాలమనీ, ఇవతలవారిది ఇరకాటం అనీ; తమరి అంతస్థుకి కొన్నివందల మెట్లు కిందిలోకంలో అద్దెలిచ్చేవాళ్లు ఉండాలని. ఇంకా కొందరి అద్దెయిజమానుల ఊహ ఏమిటంటే, అద్దెలవాళ్ళయొక్క రాకపోకలు, రీతులు, ఖర్చులు వగైరా అంతాకూడా తమ ఇష్టానుసారం ఉండాలని. ఈ అభిప్రాయం ఆయనదే కాదు. ఆయన కుటుంబానిది. కాబట్టి, ఆయనకీ ఆయన తల్లిదండ్రులకీ, స్త్రీ పుత్రులకీ, పౌత్రదౌహిత్రులకీ, లేకపోతే వీరి అర్థరు పొందిన

వారికీ—ఇంత మందికీ కూడా అద్దెవాళ్ళని ఆంక్షలు పెట్టడానికి జన్మహక్కు ఉంది. కాని, వీళ్ళనేం చూశారూ! వీరంతా ఓమెత్తూ, అద్దె యజమానురాలుగారు ఒక్కత్తీ ఒక యెత్తూ! ఒకొక్క యజమానురాలి చర్య అద్భుతం! అసలు ఆవిడ గృహిణి, అందుగ్గా అద్దెకొంపల రాణీ. అందులో కాస్త స్వాతిశయం కూడా ఉండే ఆవిడ అద్దెకొచ్చిన వాళ్ళని ఎలా చూస్తుందని తమ ఊహా? తప్పు చేసుకోడల్ని అత్తగారు ఇంతగా రొకాయించదు! నీతితప్పిన పెళ్ళాన్ని తాళి గట్టిన మొగుడు ఇంతగా దండించడు! నేరం చేసిన పాపిని దండనాధికారి ఇంతగా దుయ్యబట్టడు! చనట పరిపాలన చేసే మండలేశ్వరుణ్ణి సామ్రాజ్యమంత్రి ఇంతగా ఆజ్ఞపెట్టడు! అద్దెల వాళ్ళ ఆచారం గర్వం, తన ఆచారం మడి. తన వస్తువు ఇంకోరి ఇంట్లో కనబడితే, వారిది దొంగతనం; ఇంకోరి వస్తువు తనింటో ఉంటే, "ఎక్కడికి పోతుందీ! పొరపాటూ!" అవడం! ఆ అద్దెల వాటాల తూముల్లోంచి ప్రవహించేది అపవిత్రమైన కంపు మురుగునీరు, తన వాటా తూముల్లోంచి వెళ్ళేది పావనమైన అభిషేకజలం (ఇవంతా కలిసి ఒకటే తూము అయినాసరే ఆవిడ వాదం అంతే). దొడ్లో తక్కిన వాళ్ళ వాటాల్లో కాసేవన్నీ క్షేమంలం తనవే. నలుగురూవచ్చే నూతిదగ్గర తమరి తాలూకు పిల్లలు గుడ్డలు మాత్రమే జాడించవచ్చు! అద్దెలవాళ్ళు గనక ఆపనే అక్కడచేస్తే, "ఎవళ్ళకొచ్చిందీ ఈ వినాశకాలం! అన్నం తింటారా, గడ్డి తింటారా!" అంటూ తను ఆపని

చేస్తూనే, ధరీ అంచూ లేకుండా లెక్చరు పూర్వకంగా తిట్టడం. ఇవతలివాళ్ళు ఏమైనా సమాధానం చెప్పబోతే, "ఉంటే ఉండు, సాయంత్రం వేళకి నాకొంప ఖాళీచెయ్! మరే! నన్నొక్కత్తెని వాగించకు! నా నాలిక మంచిదికాదూ!" అని తారస్థాయిలో అరవడం. ఇన్ని హారతులూ అయింతరవాత తనకి అవసరంవచ్చే సరికి, పూర్వచరిత్ర యావన్మందీ మరచిపోయినట్టు లేనినవ్వు తెప్పించుకుంటూ రావడం (ఓగంట తిరగకుండానే). తన పని ముందు అయ్యేటట్టు చూసుగోడం. ఒక వేళ తమరింటో వంట కాకపోయినప్పుడు, తన తాలూకు ఏమనమడికో అద్దెవాటా వాళ్ళింటో అన్నంపెట్టించి, చెయ్యికడిగేసరికి వాడు, "అమ్మమ్మా, జియ్యి" అనో "అమ్మమ్మా, యాక్కు" అనో అంటాడనుకోండి మాటవరసకి. ఆపళంగా ఆవిడ పళ్ళు కొరికి పిడిమి కరుచుగుని వాణ్ణి మొట్టి చంపేటంత అభినయంచేసి, రెక్కట్టుగుని బరబరా ఈడ్చుకు పోతూ, "వెధవపీనుగా నువ్వొచ్చాను, కాస్సేపు నిమ్మళించుకోకుండాను" అంటూ తిట్టి అన్నం పెట్టించిన వాటా వారి కిటికీకి ఎదురుగుండానే వాణ్ణి ఈడ్చుకుపోతుంది! నాలుగైదుసార్లు ఈ వైఖరిభరించి, తరవాత సారి, ఆ వాటా ఆయన "అమ్మా! ఇదేమండీ! మీవాటా లేదా? పోనీ దొడ్డి లేదా?" అంటే ఆవిడ "నువ్వు చెప్పనవసరం లేదు. కుర్ర నాగమ్మ భయం చొప్పున దొడ్డోకి వెళ్ళలేడు. అదీగాక మా వాడికి మా వాటాలో కూచుంటే విరోచనం సరిగా కాదు! నువ్వెరగవ్! నీ పని నువ్వు చూసుగుందూ! అదీ గాక

బోలెడు కుక్కలున్నాయి, మనుష్యులు తిరుగుతూంటారు, మునిగిపోలేదు పోదూ" అని ఆయన మీద సబబులు కురిపించింది. ఇంకోరి సంగతి వచ్చేసరికి ఈ ప్రమేయమే ఆవిడకి జ్ఞాపకం ఉండదు. ముఖ్యంగా, అద్దె యజమానురాలి అభిమాన విద్య ఏదీ అంటే దాసీజన పోషణ. ఆవిడకి దాసీలు చెలికత్తెలు లాంటివారు. తను ఏ దాసీదాన్ని నియమిస్తుందో అదే అద్దె కాపరాల వాళ్ళందరికీ దాసీగా ఉండాలని ఆవిడ ఆజ్ఞ. ఒకవేళ తనూ అదీ పేచీపడి కట్లపాముల్లాగ లుంగలు చుట్టుకుని బిగబట్టి తిట్టుకునేటప్పుడు (ఈ ముచ్చట వారానికి రెండు సార్లేనా అవుతుంది) అద్దె కాపరాల వాళ్ళంతా ఏకమై ఆ దాసీదాంతో వైరం కట్టాలి. మొత్తంలో ఏ దాసీదైతేమని అంతా ఒక దాన్నే పెట్టుకుంటారు. కాని, ఇంతమందికీ ఒక్కత్తే దాసీది అవడంవల్ల ఒకరి పనిముందూ (అంటే ఇంటివారి పని) ఒకరి పని వెనకా అయి, అసహ్యాలు పుట్టి తిట్టుకోడాలు జరిగి, కొందరు కాపరాలవాళ్ళు దాన్ని మానిపించేసి, (చాకిరీ స్వయంగా చేసుకోగలిగినా దర్జా పడిపోతుందని భయపడి) కొత్తదాన్ని పెట్టుకుంటారు. అక్కణ్ణించి, ఇంటావిడ, కొత్త దాసీని ఎల్లాగేనా ఖజ్జాలోకి లాగమని పాత దాన్ని గిల్లడంలోనూ, ఎప్పుడూ ఇస్కూ కలపకుండానే ఏదో తరుణం చూసుకుని తనేవెళ్ళి విరుచుకుని కొత్తదాని మీదపడి కరవడం లోనూ మునిగిపోతుంది. ఒకానొక చోట ఇల్లాంటి విషయం లోనే హిడింబాయమ్మగారు అనే ఒక అద్దె యజమా

మరాలు కొంతగ్రంథం జరిపింది. హిడింబాయమ్మగారొకడ కాశీ వెళ్ళినప్పుడు అక్కడ సిగ్గు బిడియాలూ అడ్డబాసా కట్టగట్టి గంగలో విడిచిపెట్టింది—ఏహో విడిచిపెట్టాలి గదా అని. దాంతోటి, ఆవిడ ఇంటికొచ్చేసరికి అదివరకు గంటకి యాభై మైళ్ళ చొప్పునఉండే ఆవిడయొక్క వాగ్వేగం రెట్టింపైంది. ఆవిడ గాత్రమాధుర్యం గురించి మాత్రం ఎవరూ "గారంటీ" గా చెప్పలేరు. వారి తాలూకు వాటాలో ఉన్న, మా చిరకాల స్నేహితుడైన కేశవరావుగారి కొత్తదాసీని పది రోజులపాటు హిడింబాయమ్మ గదిమి, అదరకాయించడం కేశవరావుగారు తన ఇంట్లోంచే విని పదకొండోనాడు వ్యాపారం ముదిరినట్టు కనబడి, తను దొడ్లోకి వెళ్ళి సంగతి కనుక్కోడానికి యత్నించాడట. అప్పుడు వారికి ఈ సంభాషణ జరిగింది:—

కే—అమ్మా! ఏమిటండి' ఆ కేకలు?

హి—ఇక్కడ ఫ్రీమేలున్నారని చెప్పవేమే, దాసీ ముండ!

దా—ముండలు మాలో ఉండరమ్మా! నువ్వే సెప్పు!

కే—అమ్మా! నాకు బోధపడింది. తమరు పెద్దలు! తమరు ఎక్కడా ఎప్పుడూ నోరు మెదపనట్లు అల్లా సెలవిస్తారే ?

హి—(చేతులూ తలా తిప్పుగుంటూ, ఆడిపోతూ) రైంయి మంటూ వొచ్చావు గాని ఆడవాళ్ళ మీదికి, నవు సదు! ముక్కు ముక్క లవుతోందే అమ్మా! అని దాసీదాన్ని మురుక్కాలవ కాస్తతుడవ్వే అని అడుగుతూంటేనూ, "ఏమిటే,

ఉన్నందుకు !

హి—కాక మరేమిటి ! చీపురుకట్ట ఉద్యోగమే నీకు రాసింది. తుడుతుడు ! దాసీదాన్ని మాసపించి డబ్బు మూట కట్టుకో ! అంతా తుడు !

కే—భీమారావుగారూ! తప్పెవరిదో గ్రహించండి!

భీ—గ్రహించాసిరిడి. నాది.

కే—అదేం కర్మం ? మీ తప్పేమిటి ?

భీ—తప్పులు బాబూ, తప్పుకాదు ! మొదట, పెళ్ళిచేసుగోడం. రెండు, కొంప అద్దెకి ఇవ్వడం!

కే—అల్లా వాదిస్తే ఈ ప్రపంచమే తప్పూ! అతివేదాంతంలోకి దిగకండి మరి ! మేం జీతమిచ్చే దాసిది మేం చెబితే వినాలి. వింటుంది. మా డబ్బుతో మా దాసీని కుదుర్చుకునే స్వతంత్రతే మాకులేదూ! ఇక ఇండియాకి ఇంగ్లీషువారు స్వాతంత్ర్యం ఇస్తారా? అడగచ్చా?

భీ—ఇస్తారేమోకాని, మా ఆవిడ ఇవ్వనిమాట సాక్షి.

కేశవరావుగారు సున్నితపు మనిషి. ఆపళంగా ఆయన, తను అన్నప్రకారం చీపురుకట్ట పుచ్చుగుని నూతి పళ్ళెం చివరిదాకా నాలుగురోజులు తుడిచాడట. ఎవరూ చూడనప్పుడు నూతిపళ్ళెం పాడిచేసిరమ్మని; హిడింబాయమ్మ తన చిన్న సంతానానికి "కీ" యిచ్చి ఆ నాలుగు రోజులూకూడా కసిగానే ఉందిట. తరవాత ఈ సంగతి నలుగురికీ తెలిసి, కలవరం పుట్టిన మీదట, యజమానిగారు చాలా నొచ్చుగున్న పిదప, ఆవిడ

కూడా కొన్ని మెట్లుదిగి కేశవరావుగార్ని బతిమాలుకున్న మీదట ఆయన ఆ ఉద్యోగం మానేశాడట. అప్పణ్ణించీ హిడింబాయమ్మ ఆయనతో మాట్లాడుతోచ్చినా, ఆయన ఆవిణ్ణి పలికించుకోడట. అందుచేత, అప్పుడప్పుడు, కొడుకుమీద పెట్టి నేటివరకూ తిడుతూనే ఉంటుందిట. భీమారావు గారిమంచి తనం చూసి కేశవరావుగారు అక్కడే ఉన్నాడు. ఇది నాలుగో రకం. ఇవి అథమాథమం. ఇంకా వీథివేపు అద్దెకొట్లూ, ఉద్యోగి జీతంలో సగోవంతు అద్దెఉండే గవర్నమెంటు తాలూకు అద్దెభవనాలూ, బజార్లో హెచ్చు అద్దెలుండే కొట్లూ, ఊరుబయట శ్మశానాల దగ్గిర తక్కువ అద్దెలకి దొరికే కొంపలూ, కొంపకి అద్దెకి పుచ్చుకున్నవాడు దాన్లోకొంత మళ్ళీ తక్కువఅద్దెలకిచ్చిన భాగాలూ (నాటకంలో నాటకంలాగ!) వగైరా అనంతంగా ఇతర రకాలు ఉన్నాయి.

కొంపలు ఎందుకు ఖాళీ చేస్తూంటారో కూడా చిత్రమే. కొందరు చాలక, కొందరు చిక్కులు అల్లానే ఉండడాన్నించి, కొందరు ఇరుగూ పొరుగు పసిగా లేక కొందరు అంత అద్దె ఇచ్చుకోలేక, కొందరు కొత్తఇల్లు కట్టుకుని, కొందరు పాత యిల్లు కొనుక్కుని బాగుచేయించడానికి కొత్తయిల్లుకట్టేకంటె ఎక్కువ పెట్టుబడిపెట్టి, కొందరు విసిగెత్తిపోయి, కొందరు దెయ్యాలున్నాయని గ్రహించి, కొందరు పాములు కనబడి, వంటింట్లో మొండి చెయ్యి మొలవడంవల్ల కొందరు, ఇంటిసరం బీకి తేనెపట్టు పట్టి కొందరు, కొంపమీద గద్దవాలి కొందరు,

ఇంటిమీద బ్రహ్మచెముడు పాకడంచేత కొందరు, దొడ్లో అరటి చెట్టు దక్షిణానికి గెలవెయ్యడంచేత కొందరు, కొందరు తమ కొంపకి వాస్తుప్రకారం సుయోగ్యా, ద్వారబంధమో తబ్దీలుగా పడడం మూలాన్ని, కొందరు అచ్చిరాక, సరి, కొందరు మారితే చాలని.

అద్దెల ధోరణినిబట్టి చూస్తే భౌతికలోకంయొక్క అస్థిరత్వం స్ఫురణకొస్తుంది. కొంపలే కాదు. ఊళ్ళూ, జిల్లాలూ, ఈ ఇండియా, ఈ ప్రపంచం ఇవన్నీకూడా అద్దె వ్యాపారాలే సదా అనిపిస్తుంది! రోగంవల్లో, బెడదచేతో, అవాంతరం మూలానో, కూనీద్వారానో, ఆత్మహత్యారూపంగానో, దారిద్ర్యం ధర్మమా అనో ఏదో తరవాత తరవాత మాత్రమే మానవులకి గోచరించే కారణాన్ని పురస్కరించుకుని జీవుడు శరీరం ఖాళీచేసి పోతూండడం ఆరగారగా చూడగా ఎవడిమట్టుకి వాడికే తెలిసేదాన్నిబట్టి—జీవుడికి శరీరాలు అద్దెకొంపలు.

# కాఫీ దేవాలయం

సాధారణంగా ఇ. స్త్రీ రోడ్డుమీద

ఒకరు—ఎక్కడికండోయి ?

ఇంకొరు—దేవాలయానికే. మీరూ అక్కడికేలా ఉందే! అంతేనా ?

ఒ—నాకేనండీ !

ఇ—ల్లాయితే పదండి సరి

లాంటి మాటలు వినపిస్తూంటాయి.

"దేవుడు మానవుణ్ణి కల్పించాడు, మానవుడు దేవుణ్ణి కల్పించుకుంటాడు." అట్లా మానవులే సృజించుకున్న దేవుళ్లు హాయిగా చిరకాలం తమమధ్య వాసం చెయ్యకపోతారా అని మానవులు వీలైనంత ఆకర్షణశక్తిగల దేవాలయాలు లేవదీస్తూంటారు. దేవాలయం అంటే దేవుడు ఉండేచోటు అవాలిగనక, ఏమాత్రం శబ్దార్థం తెలిసిన దేవుడైనా, లేనిపోని సాకులు చెప్పి మాయంకాకుండా, తనకోసం కేటాయింపుగా మానవులు కట్టి ఇచ్చిన ఆలయంలో రోజులు (అధమం తీర్థపు రోజుల్లో) వెళ్ళబుచ్చుతుంటే తీరిపోతుందని కొందరు ఊహిస్తారు. తమరుకట్టిన దేవాలయంలో తప్ప కడం చోట్ల ఉండడం దేవుడికి అంత భావ్యంకాదని కొందరి దేశ్యాలాట. ఆయారొయొక్క స్త్రీలకి కూడా ప్రత్యేకస్థలం ఏర్పాటుచేసి కావలసినంత దేవాలయం కట్టినా దేవుడికి నిలకడ

తక్కువ అవడంవల్ల ప్రతీ ఇతరచోటా కూడా సిద్ధం అవుతూనే ఉంటాడు గనక అతగాడు ఫక్తు దేవాలయంలోగాని దొరకడని మనం పూచీపడడం ప్రమాదం అని కొందరు భావిస్తారు. కాబట్టి దేవాలయం అంటే దేవుడు ఉండి తీరవలసిన చోటు కాదనిన్నీ, దేవుడి సర్వవ్యాపకత్వం గురించి ధ్యానం చేసుకోడానికి చేరవలసిన చిన్నమనస్సులు గల మానవుల ఆలయం అనిన్నీ కొందరి సిద్ధాంతం. అందుకని, దేవుడుమాట అటుంచి, ఆకర్షించే బొమ్మలు, ధూపదీపనైవేద్యాలు, అర్చకులు, ఉత్సవ విగ్రహాలు, మంటపాలు, గంట, దేవదాసీలు, ఆదాయం (ముందు ముందు ఇది శూన్యం కావచ్చు!) వగైరా సరంజాం ఉన్న ప్రతీ ఆలయమూ దేవాలయమే అవుతోంది. తెలుగు పల్లెటూళ్ళల్లో దేవాలయాలు వెనకట్లో మోతుబరిగా ఉండేవి. పూర్వపు దేవాలయాలల్లో శిథిలమై మిగిలి ఉన్నవి ప్రస్తుతం పూర్వదేవాలయాలే. అరవ పల్లెలు సరేసరి, అరవబస్తీలలో కూడా దేవాలయాలు మిక్కుటంగానూ వెట్టిగానూ ఉండడమే కాక, పెద్దజీతగాళ్లున్నమేతూ, ఏ వాహనం మీదైనా వాటి ఎదర్నించి గమనం చేస్తూండేటప్పుడు, చుట్టుపక్కల జనం ఉన్నారనేనా జంకక, వాటికేసి తిరిగి వీలైనంత నిమ్మళంగా లెంపలు వేసుగుని దణ్ణాలు పెడుతూంటారు. తెలుగు బస్తీలల్లో దేవాలయాలున్న సంగతి కొన్ని కొన్ని వీధులపేర్లని బట్టి ఋజువు దొరుకుతుంది. కొన్ని దేవాలయాలు దేవాలయాలని ఖురానా సాక్ష్యం దొరి

కిన మీాదట నమ్మొచ్చు. వాటిల్లోకి మామూలుగా వెళుతూండే వాళ్లు పల్లెటూర్లో పెరిగివచ్చినవాళ్లు, మూర్ఖులు, చాదస్తులు, విశ్వాస్తలు, నాగరికత లేనివాళ్లు, చిత్కొంచ్చినవాళ్లు, వేశేవనున్న వాళ్ళు లాంటివాళ్లు అని నవీనుల అభిప్రాయం. కాని, నవనాగరికులు నాగాలు లేకుండా, స్వయంగా, నిత్యమూ వెళుతూండే టటు వంటివన్నీ, పై చెప్పిన "ఆకర్షించే బొమ్మలు (రవివర్మవి), ధూపం (అగరొత్తులు, సకృతుగా సకృతుగా సిగరెట్టుపొగ), దీపం, ("గ్లాసు" లైట్లులేక "ఎలెక్ట్రీ"), నైవేద్యాలు (అవసరం: టీపీ, కారం), అర్చకులు (తమిళాంధ్రద్రావిడులు), ఉత్సవ విగ్రహాలు (కొందరు ఘరానామనుష్యులు), మంటపాలు (నున్నటిబల్లలు) గంట ("సిగ్నల్ బెల్లు"), దాసీలు (ప్రాచ్యాలు), ఆదాయం (ముందు ముందు ఇది ఇంకా వృద్ధికావచ్చు!) ఇత్యాదికరంజాం" కలిగిఉన్నటు వంటివన్నీ దేవాలయం కేవలం కాఫీదేవాలయం ఒకటే. దీన్నే పామరులు "కాఫీ హోటలు" అంటారు. ఇంతేగాక, శివాలయం, అమ్మవారు గుడి, పార్థసారథి కోవెల అన్నట్టుగానే కేశవరావు కాఫీ హోటల్, నారాయణరావు కాఫీకొట్టు, మాధవరావు కాఫీ క్లబ్బు అంటూంటారు. అట్లా కాకుండా, కేశవ కాఫ్యాలయం, నారాయణ కాఫీసదనం, మాధవకాఫీనిలయం అంటూ పై పేర్లు మారిస్తే భుక్తి ముక్తి ఏకీభవిస్తాయి.

కాఫీదేవాలయం అనేది ఉజ్జాయింపుగా ఒక గ్రామంయొక్క నాగరికత లెఖ్ఖతేల్చడానికి ఉపయోగించే కొలతబద్ద. ఒక

ఊళ్ళో ఎన్ని కాఫీదేవాలయాలుంటే ఆ ఊరు ఇప్పటి నాగరికతలో అన్నిచీడీలు పైకెక్కిందన్నమాట. "ఆ ఊళ్ళో ఆఖరికి కాఫీహోటల్ కూడా లేదురా, అదేమిటండా ఊరూ! నా బోటిగాడు వెడితే అక్కడెల్లా?" అని ఒక్కొక్క నవీనుడు ఒక్కొక్క పల్లెటూరిమీద కోప్పడుతూంటాడు. తెలుగు అక్షరాలు అరసఅక్షరాల్లోంచి పుట్టడం శుద్ధడబ్బే కావచ్చును గాని, తెలుగు కాఫీహోటళ్లు అరవవాటిల్లోంచి పుట్టడం యథార్థే అయివుంటుంది. కాబట్టి, కాఫీదేవాలయాలు దక్షిణాది నించి ఎగబాకి తెలుగుదేశంలో పడుతూంటాయి. కొన్నికొన్ని రైలుమీద వచ్చి ఉంటాయి. ఉద్యోగస్తులు తమ ఇంటి భోజనం పెందరాళే కానిచ్చి పదిగంటల లోపునే కచేరీకి బయల్దేరవలసి వస్తోచ్చినప్పుడు, ఏ ఒంటిగంటకో వాళ్ళకి కాస్త నోట్లోకి ఏమన్నా కావాలి. ఇంటినించి తమదగ్గిరికి అల్పాహారం తెప్పించుకోడానికి అందరికీ స్తోమతు చాలదు. అందుచేత కొందరు ఇంటిదగ్గర్నించి కొయ్యరొట్టిలాంటి "టిఫిన్" పొట్లం కట్టుకు పోతారు లేక తన్నిమిత్తం గిన్ని చేయిస్తారు. కాని ఫలారం ఎవరమ్మినా సరే బేరంలేకుండా కొనుక్కు తినడానికి ఇష్టం ఉన్నవాళ్లు ఉద్యోగుల్లో ఉండి ఉంటారు. అందుచేత నగరి ప్రాంతాలక్షేత్రాల్లో కాఫీహోటళ్ళు చూస్తూంటే మొలుస్తాయి, పెరుగుతాయి. ఇంకా పుణ్యక్షేత్రాల్లో తీర్థాలకి కూడా కాఫీహోటళ్ళు లేస్తాయి, బస్సులు వెళ్ళే రోడ్లపక్కని, సంతెన్ల దగ్గిరా పుడతాయి, సత్రాల్లో ఉంటాయి, రైల్వేస్టేషన్లల్లో

వెలుస్తాయి. ప్రతిదినం, విధిగా జనం ఎందరో అందుకు చేరు కుంటూండే చోటికి కొన్ని అంగుళాలదూరంలో కాఫీదేవాలయం అవతరించేస్తుంది. దీనియొక్క అవసరం కనిపెట్టి, వాటమైన స్థలం చౌకగా సంపాదించి సూక్ష్మంలో కాఫీ కొట్టు పెట్టేనేర్పు అరవసోదరులది, కర్ణాటసోదరులది. కాఫీ హోటలు తాలూకు పనిలో క్షతవనాకిర్లు లేకుండా త్వమరే ఖీనం అయిపోవడం, విసుగు మరిచిపోవడం, ఒకనాడు శేషించిన పదార్థాలు మొన్నాడు తాజాగా చలామణీ చెయ్యడం, లాభం తీసి విశేషంగా ఆర్జించి బాగుపడి యావత్తు కుటుంబాన్నీ పోషించుకోడం లాంటి వాటిల్లో కూడకట్టు సోదరులు ప్రథమ తాంబూలం కొట్టేశారని చెప్పడానికి సాహసించవచ్చు. తెలుగువాళ్ళల్లో వైశ్యులు పెట్టిన కాఫీహోటళ్ళు కూడా వ్యవహారరీత్యా నడుస్తూండేవి అవడంచేత అర్జనవిషయంలో మాత్రం జయప్రదంగా ఉంటాయి. తెలుగు బ్రాహ్మణ కాఫీ హోటళ్ళు ఆమస్య చిత్రంగా ఉండేవి. అన్నిందాలా దివాలా అయి, పోగొట్టుకోడానికి మర్యాద లేక, చిరకాల ప్రియురాలు ఒకత్తె అక్కడ ఉండడంవల్ల నాటకాల్లో చేరడానికి వీల్లేక, కొందరు బ్రాహ్మణ నామధార్లు కాఫీహోటళ్ళు తెరుస్తూండేవారు. వీటిల్లో పదార్థాలు బాగా తయారయే బాపతువి కొద్దికాలంలో అంతరించేవి, తక్కినవి నామమాత్రంగా ఉండేవి. కొన్నింటిలో ముహమాటాలు ఎక్కువ, పోలీసువారు ఫ్రీ, బలంగిలవారు ఫ్రీ, తన్నినవారు ఫ్రీ, తన్నగలు అనేవారు ఫ్రీ,

పనివాళ్ళు ఫ్రీ, తన బంధువులు ఫ్రీ, తను ఫ్రీ, ఇంక మిగిలిన వాళ్ళు బకాయి కాతా. ఓ వేళ ఇన్ని జరిగీ కూడా నాలుగుడబ్బులు మిగిల్తే రెండు మూడువిధాల పైసల్. కాని, తెలుగువాళ్ళల్లో కూడా గౌరవనీయులు (ఎవరు కారు? ఆ మాటకొస్తే ఎవరు?) ఈ వృత్తిలో ధనార్జన చేస్తూన్నవారు ఇటీవల ఉంటున్నారు.

"కాఫీహోటల్" అనడానికి చాలామంది అప్రయత్నంగా "కాఫీ దేవాలయం" అని ఎందుకు అంటున్నారో నాకాశ్చర్యం. అట్టి కాఫీ దేవాలయంలో కేవలకాఫీయే కాక అనేక ఇతర వస్తువులు దొరికినా, ఆయొక్క కాఫీ పేరే ఆలయం మొత్తానికి రావడంలోనే కాఫీయొక్క ఘనత వెల్లడి అవుతోంది. "టీ" నీరు ఒకటీ, "కోకో" ఒకటీ—ఈ రెండూ మహాగొప్పవైనట్టు కాఫీతో దెబ్బలాటకొస్తాయి. కాని, ఈ ప్రాంతాల్లో కాఫీ ద్రావకం తేనీరును, "చా" పోవే, అంటుంది; కోకోని "కోకో! కం!" అంటుంది. పైగా కొన్ని విందు పార్టీలు జరుగుతుంటాయి "టీపార్టీ" లంటూ! నిజమడిగితే వాటిని కాఫీ పార్టీలనాలి. అదృష్టమేం దానికీ కాఫీ పేరుపెడితే కాఫీకి దృష్టి కొట్టి పోతుందని ఇతర పేర్లు మార్చుకుంటున్నారుగాని, ఎక్కడైనాసరే మూలపాళ్ళు కాఫీయే. కాఫీలోకూడా తాగడం అనేది ఉన్నా, స్పృహపోవడం లేక పోబట్టి పిన్నల్ని తీసుకుని పెద్దలు సయితం దీనికి ఎగబడుతున్నారుగాని, అలవాటు విషయంలో ఇదీ మత్తుల్లక్షణమే! ఏం? అన్ని అలవాట్లకీ మళ్లేసే కాఫీ అలవాటుసున్నా! ఓ గడుసువాడు ఓ మెత్తటివాణ్ణి

చూచి బలవంతంగా ఊరికే ఇప్పిస్తాను. తరవాత, పీను ఒక రోజున పన భోజనానికి ఆలస్యం అవుతుందని తెలిసి ఓ హాటు దేవాలయానికి వెళ్ళి సంగతి సందర్భాలు చూస్తాను, "ఓహో హూ!" అనుకుంటాను. మొన్నాడు పీను పొరుగూరు వెళ్లి అక్కడ తనపసి పెండరాళ్ళేకాదేమో అనే భయంచో స్పన (అసలు పనే ఉండదుగామరీ, అంచేత!) కాఫీహూటల్కి పోనీ అని వెళతాను. నాలుగోనాడు భోజనం ఆలస్యంకాదని తెలిసినా, తనకి డబ్బులక్ష్యంలేదని ప్రకటించడానికి వెనక తనికి ఇప్పించిన వాణ్ణి దేవాలయానికి తొట్టుగెళ్ళి, వారికి గురుదక్షిణగా వార్చు మేపుతాను. పదపడి "మనం (అసలా తనే) ఎప్పుడు మానాలంటే అప్పుడేమానొచ్చు అల్లాంటిదిలేదు. (అని నాలిక చప్పరించి) కాని, ఏమిటో" అంటూ మధ్యాహ్నం, సాయంత్రం కూడా వెళ్ళి సంధ్యావందనం పూర్తి చేస్తాను. అక్కణ్ణించి కాఫీ తాగితేగాని "మోహన్" కాదంటాడు. కాకుండదంటాను, తాక్కపోతే తలనొప్పి, తోచకపోవడం, పిచ్చి పిచ్చిగా ఉండి ఏమనూ పనిచెయ్యకపోవడం, కాళ్ళు పీకడం—లాంటివి ఉద్భవిస్తాయి అంటాడు. కాబట్టి, కాలక్రమాన్ని బలవంతం, కక్కుర్తి, దర్జా, ప్రతిమర్యాద, మొహమాటం, అలవాటుకాని అలవాటు, అలవాటులాంటివి, అలవాటే, అభ్యాసం, అవసరం, ఉండలేనితనం, వ్యసనం, తప్పనిసరితద్దినం లోకి దిగుతుంది వ్యాపారం. అందుకని, నిర్బంధంగా కాఫీకోసమైనా, ఐచ్ఛికంగా ఇతర తినుబండాల కోరకున్నా, ఇలటి

దగ్గర లేవ్వపెడితే ఇంటిల్లిపాతికీ అలవాటవుతుందని భయం వల్లనైతేనేమి, ఎన్నాళ్ళు ట్రైనింగుపొందినా తమకి గాని, ట్రైనింగు ఇచ్చినా తమ ఆడంగులకిగాని కాఫీలో పాళ్ళు అవగాహన కానందువల్లనైతేనేమి, జనులు దేవాలయాలకి వెనుతూంటారు. కాఫీహోటలుకధర్మమా అని కొందరు పెద్దలకి పెందరాళే నిద్రలేవడం, కొందరు పిన్నలకి పొద్దెక్కకుండా స్నానం చేస్తున్నాయి. ఇటీవలకొందరు పట్టువల విద్యార్థులు ఝామున తెల్లారకట్టే లేచివెళ్ళి, హోటల్ మేనేజర్ని లేపుతున్నారు—అతను ఒక వేళ తనకి డబ్బొచ్చేమాట మరిచిపోయి ఆలస్యంచేస్తాడేమో అని. ఒక కాఫీదాసు ఉద్దేశం తను కాఫీ సేవించకపోతే ఎల్లాగని! ఒకాయన ఊహ, తను కాఫీపుచ్చుకోకుండా సూర్యోదయం అవుతూ ఒకటా! అని. ఒక ఆసామీ నమ్మకం తను ఏమైనంత త్వరగా కాఫీ తాక్కపోతే ప్రపంచపు "సివిలిజేషన్" "హాల్ట్" వుతుందనే. ఒక పెద్దమనిషి తను కాఫీ పుచ్చుకున్న సంగతి నలుగురితోటేనా అంటేనేగాని అక్కడికి కసితీరదన్నాడు, ఆయనే ఒక వేళ కర్మవశంచేత కాఫీ తాగడం లేటయితే. "ఏమండీ, లేటయిందేం ఈవేళ?" అని ఎవరేనా అడిగినప్పుడు "అబ్బే, రెండోమాటు లెండి!" అని అబద్ధం ఆడడం ధీరలక్షణం అని రాసిస్తున్నాడు. ఒక ప్రముఖుడు కారణాంతరంవల్ల పల్లెటూరిలో పదిరోజులు ఆగవలసొచ్చి, అక్కడికి అయిదుమైళ్ళలో ఉన్న బస్టాండీమీద వెళ్ళి అనుదినమూ కాఫీమాత్రమే పుచ్చుకుని వచ్చి, ఆ కాఫీ

యేనా బాగుండలేదని స్నేహితులతో విచారంగా చెబుతూ, వాళ్ళనికూడా ఏడవమంటాడు. ఒక కర్మిష్ఠి తనతండ్రి తద్దినం నాడు "ఈ వేళ కాఫీ ఎల్లాతాగను మరీ, చూసి చూసి" అనుకుని, బ్రాహ్మలొచ్చేవరకూ ఓపికపట్టి, ఎల్లాగో తద్దినం కానిచ్చి, పిండాలు గంగలో కలిపి ఇంటికి వచ్చేటప్పుడు దార్లో కాఫీహోటలికి వెళ్ళి, రెండుమూడు కప్పులు తాగి, ఇంట్లోపడి తలకి పట్టేసుకుని నిద్దరపోయి సాయంత్రానికి లేచి అప్పుడు రెండు మెతుకులు కొరికేవాడు. ఒక పితృభక్తుడు కాఫీ ప్రియుడైన తన తండ్రిగారి ఆబ్దికం అయిపోయి బ్రాహ్మలు ఇక వెళ్ళిపోయేటప్పుడు వాళ్ళిద్దరిచేతా చెరో నురచెంబుడు కాఫీ తాగిపించి మరీ వాళ్ళని సాగనంపేవాడు.

ఇంతాచేసి కాఫీ అనే ద్రావకంలో మిళాయించేవి ఏవి అని అడిగితే, పాలు, పంచదార, కాఫీగింజల చూర్ణంతాలూకు సారం. ఈ సారం కుంకుడుపులుసు, సీకాయిపులుసు, చింత గింజల చూర్ణసారసం, హాలాహలం వీటికి మల్లే నల్లగా ఊరుతూంటుంది. తెలుగులో ఈసారాన్ని "డికాక్షన్" అంటారు. (సంస్కృతంలో కషాయం అనచ్చు). "సుబ్బరంగా పాలే పుచ్చుకోకూడదా రాజులాగ, డికాక్షన్ అంటూ అహోరించకపోతే!" అని కొందరు కూకలేస్తూంటారు. తెల్లగా ఉండే క్షీరానికీ నల్లగా హాలాహలంలా ఉండే డికాక్షన్‌కీ పొత్తు ఎక్కడ ఏడిసిందని వారి ఉద్దేశం. కాని, వాటిసంబంధం సముద్ర మథనకాలం నాటినించీ వస్తూనే ఉంది. ఈ రెండూ

కలిపేసరికి దీని తెల్లవర్ణమూ దాని నల్లవర్ణమూ కూడా పోయి మధ్యవర్ణం ఒకటి ఖాయపడుతుంది. అనగా క్షణ క్షణమూ కాఫీహోటళ్లలో ఆయొక్క వర్ణానికర్థం ప్రత్యక్షం అవుతూంటుంది. ఆమధ్యవర్ణానికి ప్రత్యేక వ్యక్తిత్వం విశేష ఖ్యాతికూడా ఏర్పడ్డాయి. "మీరారు ఈసారి మద్రాసు వెళ్ళినప్పుడు నాకు ఓ, కాఫీకలర్ స్టిక్కు తెచ్చిపెడదురూ!" అని పెద్దమనుష్యులు తమ స్నేహితులకి జ్ఞాపకం చేస్తూంటారు కూడాను. అంతేకాక ఆ రెండూ కలపడంలో సొగసుంది! కలపడం అంటే తెలుగువాడి కలపడం కాదు. తెలుగువాడికి కలవడం ఎంత తెలుసునో కలపడంకూడా అంతే తెలుసు. కలిపినా వేరుచేసినా అరవలది ఆసేర్పు. అందులో రప్పుదేరిన అరవ అయ్యారు కాఫీకలపడం చూస్తే మెడ నెప్పెట్టిపోతుంది. ఎవరో ఒక కొత్త కాఫీదాసు వీధులో నడుస్తూ, "ఈ కాఫీ హోటలు బ్రాహ్మలదేనా?" అని కనుక్కుని, వచ్చిన సమాధానం తనకి నచ్చిన తరవాత లోపల ప్రవేశిస్తాడు. అప్పుడే ఎవరూ కనిపెట్టకుండా, దొంగచాటుగా తన ముఖం అద్దంలో ఎల్లా ఉంటుందో చూసుకుని మెచ్చుకుని, "ఓ కప్పు కాఫీ ఇవ్వాండి" అని ఆర్డరు జారీచేసి, ఒక బల్లదగ్గర ఉండే ఖాళీకుర్చీ ఈడ్చుకుని కూర్చుంటాడు—ప్రపంచంలో సమస్త వ్యాపారాలు తనవల్లో ఉన్నట్టు. ఈపాటికప్పుడే అయ్యారు ఒక కప్పుల జోడీ లాగిపుచ్చుకుని, ఒక "స్పూను" పంచదార లోపలిగిన్నెలో గిరవటేసి, "ఎన్నా సార్ కప్పా, అర కప్పా,"

అంటాడు. అవి, జబాబు ఏమైనా సరే, సాధారణంగా కప్పే కలుపుతాడు. ఆమట్టున అతడు లోపలి కప్పు కుడిచేత్తో పైకి తీసి గుజ్జుపుమొహంవాళ్ళు తగిలేవరకూ పైకెత్తి, ఎడంకప్పు కుక్కమూతివాళ్ళకి అంటుగుసేదాకా కిందకి పెట్టి, అంత ద్రావకమూ హడిలిపోయి జవజవలాడి పేకదారంలా అయ్యేట్టు తొణకకుండా పాకం తీస్తాడు. ఈలోపుగానే కాఫీ తెచ్చినవాడు తన ఎదటి బల్లమీద కప్పులూ, కాఫీ చుక్కలూ, పరేసిన మిర్చి ముక్కలూ చూసి, "ఈబల్ల కొంచెం తుడవాలండి" అని కేకేస్తాడు. ఆపళంగా కప్పులు లాగే కింకరుడు హాజరవుతాడు. కొండొకచో ఈపనికి ఒక మలయాలీ ఉంటాడు. అతడికి జుట్టు రేవునెత్తిమీద మాత్రమే ఉంటుంది, నడికుప్ప మీద పెంకులున్నట్టు. అతడు గబగబా ఓబాల్చీలాంటిది తెచ్చి దింపుగుంటాడు. దింపుగుని కప్పులు దాన్లో పారేసి ఒకవేళ రూల్సు ఎరగనివాళ్ళు పోసినసీళ్ళు విస్తారంఉంటే గుడ్డతోనే (అది సాధారణంగా తడవదు, కాలదు) బాల్చీలోకి తోసుకుంటాడు. పిదప తనగుడ్డతో బల్లంతా శుభ్రపరిచే సంకల్పంతో పాముతాడు. దాంతోటి ఒకచోటి మాలిన్యం సర్వత్రా సర్దుకుంటుంది—ఒకడితప్పు అనేక మందిని వెంటాడించినట్టు! పైపెచ్చు ఆగుడ్డకి సంబంధించిన గంధద్రవ్యాలు బల్లకే అంటుకుని ఒకవిధమైన కొత్తవార్నీసు తయారై ఈగల్ని ఆకర్షించి వాటిని మరి వదల్దు. తక్కిన ఈగలు ఈ సంగతి కనిపెట్టి, మనుష్యులమీదగాని వాలడం

మానేస్తాయి. కప్పులమీంచి ఆవిరి వస్తూంటే కాఫీ తాగడంలో సర్వీసు లేనివాడు "అబ్బా వేడిగ్గుంది" అని అది చల్లారేవరకూ కప్పు ముట్టుకోకుండా ఆగుతాడు—కాఫీహోటల్లో అస్పృశ్యత గురించి పట్టింపులు లేవని తెలిసికూడాను! అది చల్లారిం తరవాత, చక్కెర ఎక్కువగా వేయించుకుని, ఆకప్పు పైకెత్తి గడగడా పానకం తాగినట్టు పీల్చేస్తాడు. కాని, కాఫీ ద్రావకం సంప్రదాయానుసారంగా తాగనేర్చిన శిష్టులు నెమ్మది నెమ్మదిగా ఊదుకుంటూ, చప్పరించుకుంటూ, మాటలు చెబుతూ, కాస్త కాస్త చొప్పున కాఫీ కతుకుతారు. ఒక్కొక్క పెద్దమనిషి పెద్దకప్పు బల్లమీదే వొదిలేసి చిన్నకప్పుని మూతిదగ్గరికీ, బల్లమీదకీ మళ్ళీ మూతిదగ్గిరికీ—ఇల్లాగా సెకనుకి రెండుసార్లు బదలాయిస్తూంటాడు. ఆసమయంలో బల్లమీద పెద్దకప్పుయొక్క ఉపయోగం పూర్తి అయింది కాపు ననుకుని కప్పుల కింకరుడు దాన్లో ఇంకా కొంత కాఫీ ఉండగానే కప్పుని బాల్చీలోకి దిగలాగుతాడు——కొన్ని ప్రాణాలుండగానే మనిషిని పాడిమీదికి లాగేసినట్టు. ఈ విషయంలో కొందరు కుశాగ్రబుద్ధులైన కాఫీదాసులు దూరం ఆలోచించి, తమరు తమ కుడిచేతితో చిన్నకప్పులోంచి కాఫీ ఆరగించేటప్పుడు, బల్లమీద పెద్దకప్పు ఎడంచేతితో వడేసి, రాయిల్లా పట్టుకుంటున్నారట! వాళ్ళ ఊహ కప్పుల కింకరుడొచ్చి బల్లమీద కప్పు లాక్కుపోబోతే, తనూ ఆ యమకింకరుడూ తద్విషయం కుస్తీ పట్టచ్చు గదా అని!—— సత్యవంతుడు ప్రాణాన్ని

"పోస్తున్నాడే!" అంటూ సావిత్రి ఇటూ, "పో. బాల!" అంటూ యముడూ అటూ పాడుతూ లాగేసట్టు!

కాఫీ దేవాలయం ఎల్లకాలమూ హడావిడిగానే ఉంటుంది (వార్తాలు రోజుల్లో తప్ప). కాని అందులో ఉదయం, ఒంటి గంటకీ, సాయంత్రం టైముల్లో మాత్రం ఊపిరి సలపకుండా ఉంటుంది. ప్లేట్లు, చెమ్చాలు, గ్లాసులు, సాసరాల చప్పుడు వినిపిస్తుంది. అందుచేత వాడికి చాకచక్యం చాలా అవసరం. అందివ్వడంలో కూడా అరవలే ఫస్టు. అందులో ఒక్కొక్కడు అష్టావధాని. "ఏం కావాలండీ మీకు!" అని చెవుగుడి ఆడుతూ కనుక్కుంటూనే, వెళ్ళిపోయే ఇద్దరు ఇవ్వవలసిన డబ్బుగురించి మేనేజరుతో "ఎక్స్ట్రా, రెండు బేర్" అంటూనే, బల్ల తుడవమని అప్పుడే ఎవరో కోరగా "బల్ల తుడవరా ఎదవా" అని తుడిచేవాణ్ణి కసురుతూనే, "నాకు పెసరట్టండోయ్" అని అప్పుడే ఎవరో కోరగా, లోపల వండేవాడికి "పెసరెట్ రోస్ట్" అని కబురు అందిస్తూనే, దొడ్లో కప్పులుకడిగే వాణ్ణి "కప్పు తేవిరా, బేగీ!" అని పళ్ళు బిగించి లోపల తిడుతూనే, లోగడ దరఖాస్తు చేసుకున్న ఎనమండుగురికి ఎనిమిది ప్లేట్ల సరుకు ఏక కాలంలోనే ఎడం చేతిమీద గోపురంలా పేర్చుకు వచ్చి టకటకా ఇస్తూనే, వారికే ఎనిమిది కప్పుల కాఫీ ఓకేసారి ఎడం చేతి వేళ్ళతో నొక్కి తెచ్చి, ఒక్కొక్కరి ముందు ఒక్కొక్క కప్పు పెట్టి, ఒక ధరివించి ఒక్కొక్క సెకనులో ప్రతి కప్పులో కాఫీని ఒక్కొక్క సారిగా

"డెవలవర్సు" సాగదీసినట్లు పిలక సాగదీసి కూచోబెట్టి చక్కా బోతూంటాడు. "గంటైంది చెప్పి, ఇంకా నాకు ఉపాహారం అందలేదు" అని కొందరు మేనేజరుతో ఫిర్యాదు చేస్తూంటారు. "ఒక అర కప్పు కాఫీ తెస్తు బాబూ! నేను కోర్టుకి పోవాలి" అని కొందరు విసుక్కుంటూంటారు! "ఈ వేళ ఇడ్లీలోకి సాంబారా, పచ్చడా?" అని కొందరు అడుగుతూంటారు. ఏవృత్తిలో ఉండేజనం అయినాసరే కాఫీపుచ్చుగోందే పన్లోకి త్రికరణశుద్ధిగా దిగరు. బండీ వాడి మొదటి కిరాయి డబ్బులు కాఫీకి, పుల్లలవాడి మొదటి పట్టి డబ్బులు కాఫీకి, మంగలిచేసే మొదటి క్షౌరం డబ్బులు కాఫీకి. అందుకని కొందరు ఘరానా రకం వీధికొట్టు వాకలి లోపలికి జొరబడుతూంటారు—గర్భ గుడిలోకి జొరబడ్డట్టు. కొందరు తమరి మాట వడ్డన వాళ్ళు ఎంత సేపటికీ వినిపించుకోకపోతే, చనువుచేత తమరే వెళ్ళి పెసరట్టు వగైరా వేసుకుంటారు—స్వహస్త పాకల్లాగు. ఒకొక్కొక్క పట్టింపు పెద్దమనిషి పాలూ, డికాక్షనూ వేరే వేరే తెమ్మని అని తనే మిళాయించుకుంటాడు, మహా. ఒకొక్కడు ముందు ఒక అరకప్పు తాగి, మాట్లాడుతూండి మళ్ళీ అరకప్పు తెమ్మని, కప్పు రేటు ఇస్తాడు— ఈపద్ధతి కేసకి కాస్త రాహిత్తు కాకపోతుందా అని! మర్యాణ్ణించి మేనేజరు ఇందుకు ఒప్పుకోడు. "ఇంతమంది వచ్చి ఇన్నిరకాలుగా ఫలారాలు చేస్తున్నారుగదా ఎవడు ఎంత ఇవ్వాలో సరిగ్గా చెబుతారండీ, ఈ వడ్డనవాళ్ళూ! ఏమి మేధండీ, వీళ్ళది!" అని కొందరు,

పడ్డనవాళ్ళని మెచ్చుకుంటూంటారు. కొందరు, వడ్డనవాళ్ళతో లెక్కల్లో తేడాలొచ్చి మేనేజరుదగ్గర పేచీల్లో ఉంటూంటారు. తప్పొప్పుగా మేనేజరుగారి పరిచయులు చక్కావస్తారు. దాంతో మేనేజరు "చూడ్రా! పంతులుగారొచ్చారు, ఏం కావాలో కనుక్కో! నాలుగు ఇడ్లీ ఇయ్యి సాంబారేసి" అని వడ్డనవారితో అని, "ఈవేళ సాంబార్ చాలా నైస్‌గా ఉందండీ, సార్" అని బలవంతం చేస్తాడు. "అత్తారింట్లో కంటేకూడా ఏం బలవంతం చేస్తున్నావోయ్! ఎటొచ్చీ నువ్వు బిల్లుచేస్తావు! నీ సామ్మేం పోయింది" అని లోపల అనుకున్నా, చుట్టుపక్కల అనేకమంది ఘరానామనుష్యులు (అనగా కాఫీదాసులంతా ఘరానా మనుష్యులే!) వింటూండగా తను అక్కర్లేదనడం తన ఆత్మగౌరవానికి మిక్కిలీ భంగం అనుకుని, నలుగురి ఎదటా తను పిసినిగొట్టు కానట్టు ప్రకటించుకోడానికికుడా అనుకూల సమయం అదే అనుకుని, "సరే, తెమ్మను" అని ననుగుతాడు. విడివిడిగా వచ్చినవాళ్ళల్లో కొందరు డబ్బు ఇచ్చేస్తారు, కొందరు రాసేస్తారు, (ఈరాతలన్నీ మేనేజరుకి ముట్టితే అతడు కుబేరుడవుతాడు). కొందరు పరిచయులు ఇంతాఅని చెప్పేస్తారు, కొందరు ఇంకా ఘరానా వారు బరాబర్‌గా చక్కాపోతారు. సడసడీ ఎవరో ఒకాయన అయిదారుగురు అతిథుల్ని తీసుకుని తయారవుతాడు. అతిథులు సాధారణంగా కోర్టు సాక్ష్యాలకి వచ్చినవారో, డబ్బున్న కుర్రాణ్ణి ఉబ్బేసి వాణ్ణి గ్రంథంలోకి దింపి వెంటపడి వచ్చినవారో, ఎవడికేనా ఎందులోనేనా లాభం

రావడంవల్ల వాణ్ణి మొహమాటపెట్టి తోలుకొచ్చినవాళ్ళో, ఒ స్త్రీ స్నేహితుణ్ణి చూడొచ్చిన బంధువులో అయి ఉంటారు. సమూహంగా వచ్చిన వాళ్ళలో కొన్ని విశేషాలు జరుగుతూంటాయి. కొందరు నిర్మొహమాటస్థులు కలిసి వస్తారు. ఓడిపేళ మరోడు పెట్టించాలని ప్రతీవాడూ యిత్నిస్తాడు. అందుకని వారిళ్లో ప్రతివాడూ (ఎంతైతే తనకేమి!) తెగ ఆర్డరు ఇస్తూంటాడు. వీరిలో గడుసువాళ్ళంతా ఘనపదార్థాలు గబగబా నమిలేసి, చివరికి ద్రవపదార్థాల్లోకి వచ్చి కాల్తూన్న కాఫీ అయినా సరే నోట్లో పోసేసుగుని వీధులోకెళ్ళి నిలబడతారు. మిగిలిపోయిన చాదస్తుడు ఉసూర్న బిల్లు చెల్లిస్తాడు. కాని ఒకసారి ఇద్దరు తమాషా స్నేహితులు ఒక కాఫీదేవాలయం ఎదట కలుసుగుని, "ఇదుగో, మీకోసమే చూస్తూంటా, రండి!" అంటే, "ఇహనేం, నే వెతికేదీ మీకోసమే!" అని ఒకర్నొకరు ఆహ్వానించుగుని, ఆలయంలో ప్రవేశించారు. ఒకడు కాస్తంత పెద్దమనిషి, రెండోవాడు ఆకాస్తంతే చిన్నమనిషి. కాని లోపల అభిప్రాయాలు మాత్రం తిండిఖర్చు వీడికి రుద్దాలని వాడూ, వాడికి రుద్దాలని వీడూ.

పెద్ద—చూస్తారేం? తెమ్మనండీ!

చిన్న—తమరు పెద్దలు! తమరే ఉపక్రమించండి.

పె—ఎవరైతే ఏముందీ? మీకు చాదస్తంగాని!

చి—అందుకనే నండి నే అన్నదీను.

పె—(వడ్డనవాడితో) నాలుగేసి ఇడ్లీ నెయ్యేసి తేండి!

చి—(కాస్సేపు ఆగి) నాలుగేసి పెసరట్లుకూడా తెండి- ఇంత అల్లం పారేసి!

పె—(పదార్థాలు గబగబా భొక్కుతూ) రెండేసిప్లేట్లు సేమియా !

చి—(ఓప్లేటు సేమియా మందుపుచ్చుగున్నట్టు ఒకేసారి గొంతిలో పోసుగుని) నాలుగేసి థైర్ వడ! పెరుగేసి !

అంటూ చెరోసారి ఆర్డరుచేస్తూ మొత్తం అణా తక్కువ రెండురూపాయలు తిన్నారు. ఇంతలో చిన్నవాడు మూతి కడుక్కుంటూంటే, పెద్దవాడు, వీధిలో సైకిల్ మీద పోయే ఒకాయన్ని తెలుసుగోపలిసిన పనున్నట్టు మిష పెట్టి, ఆయన్ని కేకేస్తూ, చివాల్న లేచిపోయాడు. చిన్నవాడు కంగారు లేకుండా, చెయ్యి కడుక్కుని పెద్దాయనకంటె మరోఆకు చివరే ఉన్న పాడపడుచేసి, బల్లమీద సిద్ధంగాఉన్న కిల్లీలు రెండు చేతపుచ్చుగుని, ఆ పెద్దాయన కాతా పేజీ తీసి రెండు రూపాయిలూ అందులో రాసి చక్కాపోయాడు. వీటిల్లో ఎవరు నెగ్గుతారో చివరదాకా తెలియదు.

మూడో తరహావాళ్లున్నారు. వారు కలిసేవచ్చి, తిని, కాఫీలు తాగి, ముత్తపుఖర్చు ఇవ్వడానికి ప్రతీవాడూ తిలో మనీపర్సు పెల్లగిస్తాడు (అందులో ఉన్న డబ్బుసంగతి వేరు విషయాలు)! కాని వారి నాయకుడు "పుచ్చుగోకండి, నిజంగానే!" అని మేనేజరుతో నిక్కచ్చిగా చెబుతాడు. అంతమాట్లు కొచ్చినా కుడా అతి ఘుల్లో ఒకొక్కడు (చివరకి

తనవి ఎల్లానూ ఇవ్వవలసినదనుగదా అతని ధైర్యం కాబోలి) "చిల్లర నాదగ్గిర ఉందిగా!" అంటాడు—(కాఫీహోటల్లో చిల్లర కరువొచ్చినట్టు!) అటువంటప్పుడు ఆ నాయకుడు మొహమాటస్తుడైతే "నా దగ్గిరా ఉంది!" అని తనే చెల్లిస్తాడు; నిర్మొహమాటస్తుడైతే, "సరే, అల్లాయితే!" అని ఊరుకుంటాడు. ఆఖరంగా ఆ అతిథి లోపల, అడ్డంగా మూడీ, చిప్పాట్లు దొంతుసామ్మూ దాఖలుచేసుకుని, "అన్నన్నా! మనకి వెళ్ళవ తొందరస్తే" అని ఒక్కడూ ఉన్నప్పుడు నవ్వి తెగి నేలు కొరుక్కుంటాడు! ఒకడు తనుతిన్న ఖర్చంతా తన స్నేహితుడు చెల్లిస్తూంటే, రావిఆకుల్లా ఊగుతూ, ఇవన్నీ అయ్యాక తరవాత ఆడబ్బులు వాడికి ఇచ్చేమాన్తాడు, (ఏమొహం పెట్టుకుని వాడు పుచ్చుకోవచ్చాడని)! నాయన "ఆ, పోదురూ!" అని బెట్టుచేసినట్లైతే. "పోనిలెండి, అధమం కిల్లీలేనా నన్ను కొననివ్వండి!" అని ఆ ఖర్చు తను పుచ్చుకుని, "మీరు సిగరెట్టు కాల్చరనుకుంటాను!" అంటాడు. అంటే రెండోవాడు "కాల్చకేం లెండి, ప్రస్తుతం, అక్కర్లేదు" అని అనేస్తాడు. కొందరు పెద్దమనుషులు వేసుగునిఉండికూడా స్టిక్కులూ, కొత్తజోళ్ళూ, తాంబూలం వెయ్యానే ఊహతో అవి దొరక పుచ్చుకుని, ఒకవేళ మేనేజరికి గాని, అవస్తువు యజమానికి గాని, దొరికిపోయి నప్పుడు, "మీదా? మీదే?" అని ఆశ్చర్యపోయి, నవ్వుతూ, "అచ్చంగా నాదే అనుకున్నాను స్మండి!" అని అది అక్కడ వొదిలి పెట్టి జారిపోతాడు!

గుంటూరు కొందరు ఎల్లా నేనా మానాలని, ఆఖైరుకి, కాఫీ ప్రత్యామ్నాయి వేడి నీళ్ళో, చారో ఊదుకుని కొద్దికొద్దిగా పీలుస్తారు. కొందరు మానని వాళ్ళు, ఆఖైరుకి ఇంత చప్పని మజ్జిగే దేశవాళీ కాఫీగా భావించి పుచ్చుకుంటారు. ఒకొక్కడు ప్రాణాలు ఉగ్గబెట్టుకుని పదిరోజులపాటు కాఫీమానేసి, పదకొండోనాడు తెల్లారకట్టవించి పూటకి మూడుకప్పులు మింగి లోగడబాకీకూడ దీసుకుంటారు ఒకాయన తన పక్క ఒక దారుణరోగి కూచుని కాఫీ తాగుతూండడం అసహ్యించుకుని కాఫీ మానేశాడుట—అప్పూటకి! కాఫీ మానేసి, కొందరు అస్మదాదులు, కాఫీహోటలికి వెడుతూనే ఉన్నారు. "మానేశాను గదా, ఇక ఎందుకయ్యా!" అంటే "క్లైమేట్" కోసం అని చెబుతున్నారు.

ఒ స్త్రీజనం తప్పనిసరిగా ప్రతీరోజూ, అవాంతరాలు జరిగితే తప్ప, కలుసుకునేచోటు కాఫీ దేవాలయమే. ఇల్లాంటి సంస్థలు లేకపోతే ఎవరికన్నో వారుంటారు గనక ఒకరొకరికి పరిచయమే ఉండదు. మరీగొప్పవారు కానివార్ని ఎవర్నైనా పోల్చుకున్నగాని, ఒంటిగంటకిగాని కలుసుకోవాలంటే, అందుకని మామూలైన దేవాలయం కనుక్కొని వెడితే సరి! ప్రయాణాల్లో ఎవరైనా "మిమ్మల్ని ఎక్కడో చూచినట్టుందండీ!" అని ఇంకొకర్ని హెచ్చరించినప్పుడు వీరూ వారూ జ్ఞాపకశక్తులు కలబోసుకుని ఆరాలు తీస్తే, ఆ కలుసుకోడం ఏదో కాఫీ దేవాలయం లోనే అయిఉంటుంది. వార్తలు పుట్టడానికీ, ప్రకటన చెంద

దానికి కాఫీదేవాలయం మిక్కిలి వీలు. లండన్‌లో, నానాజాతుల కాఫీదేవాలయాలు గల ఒక ఘంటాపథంలో, రాజాధిరాజుల కాఫీ హోటలికి ఎదురుగుండా వీరాస్వామినాయుడుగారి హిందూ కాఫీహోటలు అనేక పరికరాలతో ఉందట. కాఫీ విషయంలో హిందువులు తీవ్రంగానే పనిచేస్తున్నారు.

# నా మీదే నర్రోయ్!

అనగనగా ఓ ఊరు (అంతమాత్రాన్ని ఇది పిట్టకథా కాదు, జాతకథా కాదు!). ఆఊళ్ళో ఓ యిల్లుంది, మరెక్కడా ఉండడానికి వీల్లేక! లోగడ చాలా ఊళ్ళకి పేరు పోయినట్లే ఆ ఊరికిగూడా పోవడంచేతనున్నూ, రాబోయే జనాభాలెక్కల సందర్భాలలాంటి వాట్లగ్గల్ల ఇంటినెంబర్లు మారుగుడు కావడంచేతనున్నూ, బోలెడు పాత రికార్డు దులిపితేగాని ఆ ఊరియొక్క వెనకటిపేరు తేలదు; బోలెడు ఇతర ఒడిసుళ్లు పడితేగాని ఆయిల్లున్న జాగాయొక్క నయిసం తేలదు. అందుకని తబిసీళ్ళుగురించి నన్ను అట్టే రొక్కాయించక ఎందుకన్నానో అన్నాన, ఇల్లా పోనిండి ఈ కథాకి. ఆ యింటి యజమాని ఒకాయనే అని కొందరూ, ఇంట్లో ఉండేజనం యావన్మాత్రశిష్టం యజమాన్లే అని మరికొందరూ పట్టింపులు పోయేవారు. పోనీ మనం ఏదోకానికి రాజీకి దిగి ఒకాయనే అని ఒప్పుకుందాం. ఆయనకేనా ఏదో సంజ్ఞ ఉంటేతప్ప వ్యవహరించడం కష్టం గనక, ఆయన్ని "సుభర్త" అందాం. ఇంటావిడగార్ని అప్పుడు "సుభార్య" అనిన్నీ, వారి కుమారుణ్ణి "సుపుత్రుడు" అనిన్నీ పిలవచ్చు. ఇంటివారంతా కూడా అఖండజ్ఞాను లైనప్పుడు, పేర్లు మంచిగా ఉండడంలో చెడుగు ఏమీలేదు. సుభర్తగారి తల్లి ఉంది. ఆవిణ్ణే —

ఒక గ్లాసూ, పప్పుగిన్నీ, చెమ్చా వగైరాలు చప్పుడు కాకుండా స్వాములార దగ్గిరపెట్టి లోపలికి వెళ్లింది. స్వాములారు చుట్టు పక్కల అయ్యో అలికిడికూడా చెవిని పట్టని యోగంలో ఉంటూన్నప్పటికీ తన దివ్యజ్ఞాన మహిమవల్ల, కాఫీ పరికరాలు తన సాన్నిధ్యానికి అరుగుదెంచడం పోల్చాడు. తక్షణమే కళ్ళు విప్పి, వేళ్ళ సంధులు కెట్టించి, ఆవలించి చిటికేసి గొంతుక బాగుపడే నిమిత్తం దీర్ఘంగా సకిలించి, గుటకేసి, "నారాయణ" అనుకుని, ఆయన గ్లాసులో ఉన్న పాలుపోసి ఆ పప్పుగిన్నెలో ఆయొక్క క్షీరకషాయసమ్మేళన మహోత్సవ వైభవం చేతులారా జరుపుతూ, కళ్ళారా చూస్తూ ఉన్నాడు. పవనవోదయం చాలుస్తూ, సకల కశ్మలహరమై ఒప్పేటటువంటి పతత్కాక్షీరద్రావకగంధం వారి నాసికాగ్రాన్ని ఢీకొన్నసరికి వారికి నోరూరి, నాలిక జలడి, వాగ్ధారప్రసరించేటంత పనీ జరిగింది. కాని సుభార్యగారు క్షణానికోసారి ఊసూరూ ఎగపీలుస్తూండడం, నిరంతరం ఊహూరూ చీదుస్తూండడం కూడా స్వాములారికి ఇబ్బందించి విసిపిస్తున్నాయేమో, ఇంతా మస్తాబు చేసుకుని తయారైన వారియొక్క లెక్చరు దేవి వేషం తీసేసి వెనక్కి వెనక్కి అణగారడం మొదలెట్టింది. అయినా సరే, ఆవిడ దుఃఖానికి కారణం ఏమిటో గమనించి తీరాలనే బుద్ధి ఆయన్ని వదలకుండా పట్టుకోడంవల్ల, ఆయన తనకి కావలసిన పంచదార పక్కనే ఉన్నట్టు చూసీకూడా, అడిగీ అడగనట్టు— "అమ్మా! కాస్త పంచదార!" అని "ఓహో, ఇక్కడ పెట్టే

దశారా! మరి తేనక్కర్లేదు, తల్లీ!" అన్నాడు (మహా అక్కడికి, తను కే కేసిన దరిమిలానే అది తన కంట పడ్డట్టు)! ఇల్లాంటి అర్థమిసి పరామర్శ తనకి నచ్చని గావును, సుభార్య తన మూగనోం లోనే ఉండిపోయింది. దాంతోటి స్వాములారు తప్పకుండా ఏదో కమామిషు ఉందనుకుని, ఒక చిన్న "తనలో" (అనగా స్వగతం) ప్రారంభించారు: "క్షీరం బ్రహ్మ, శర్కర ప్రకృతి, కషాయం జీవుడు. కాఫీ ద్రావకం స్వయంగా సృజన గావించు కునే భక్తకోటికి ఆయొక్క ప్రకృతి జీవబ్రహ్మైక్య విషయబోధ ప్రత్యక్షంగా సిద్ధిస్తుందిగదా. తిన్నగా చూస్తే అంతా తత్వమే. అదే నీవు" అని.

ఈ వాక్యాలతోటి, సుభార్య సావిడి తలుపు దగ్గిర కొచ్చి, "నాయనా, ఒక్కరవ్వ పడ్డించమన్నారండి!" అని కనుక్కుంది.

స్వా—ఉన్నదమ్మా. మరి అవసరంలేదు. అయితే అమ్మా, తమరు తత్వం వింటుంటారుగదా, దుఃఖంలో ఉన్నారే! సుఖానికి గర్వించరాదనీ, దుఃఖానికి ఏడవకూడదనీ, నిన్నటి ప్రసంగంలోనేగా అయ్యగారూ నేనూ ముచ్చటించాం! ద్వంద్వాలయెడ సమభావం ఉండద్దూ, తల్లీ!

సుభా—నిజమేనండి. నేనూ విన్నా. కాని, స్వంతవ్యాపారం వచ్చినప్పుడు తత్వం హుళాష్ కాకీ అవుతుంది.

స్వా—అయ్యగారు వీధులోకెళ్ళి ఎంతసేపైంది?

సుభా—ఇప్పు డిప్పుడే. ఆయన వెళ్ళిన అరగంటకి మీరొచ్చారు. మొహం కడుక్కుంటూనే వారు నన్ను కాఫీ కాచ

తున్నారు. నాకు చెయ్యి ఊరుకోక, చేతులో పని చేసేనుకుని కాస్తానండీ అన్నాను. అంటే ఆయన 'పోస్లే వద్దు, కాఫీహోటే లికి వెళ్ళి పుచ్చుకుంటూ, స్వాములారు వచ్చేమాత్రం కాచు' అని నాతో చెప్పేసి, చక్కాపోయారు. ఇక కావాలి

స్వా—వారేమన్నా ఆగ్రహం చాల్చి వెళ్ళడంవల్లగానీ తమరు చింతిల్లడం లేదుకద?

సుభా—కాదండీ. మావాడు పట్టంనించి ఉత్తరం రాల్చాడు. వారూ బయటికి వెళ్ళగానే వచ్చింది.

స్వా—ఏం? అంతా క్షేమమేకదా?

సుభా—మీ దయవల్ల.

స్వా—ధననష్టం ఏమన్నా వచ్చిందా?

సుభా—ఇల్లాంటి దిక్పాను స్మరించడానికే వీలు లేదండి.

స్వా—నాకేమిటు తెలుస్తా! ఏమిందది ఉత్తరంలో? అబ్బాయి పరీక్ష పేలిపోయిందా? మీ దావా పరాయి పక్షం అయిందా?

సుభా—అవేవీ కాదండి! పొరుగింటారబ్బాయిచేత ఉత్తరం చదివించాను.

స్వా—చెప్పవమ్మా, తల్లీ!

సుభా—దేశదేశాలా మాకున్న కీర్తి నాశనంఅయిపోయింది టండీ, బాబుగారూ! మాయింటివాటాలో అద్దెకి తగులడ్డ వచ్చినాడి వల్లేనండీ నాయనా! (అని బావురుమని కుళ్ళుతుండి)

స్వా—అన్ని దేశాల్లోనూ ఏకకాలమందే పోయిందా? ఉండు, ఉండవమ్మా. తమాయించు. ఏదీ, ఆఉత్తరం!

సుభా—(లోపలికెళ్ళి తెచ్చి) ఇదిగోనండి.

స్వా—బాబుగారొచ్చి చదివేస్తే బాగుండును, నాకు ఆనదు. అదుగో! చిరంజీవి! రండి!

అనేసరికి, సుభద్ర, అప్పుడే కొండలు పిండిగొట్టి దండయాత్ర నించి వచ్చే తీవితో ఇంటికొచ్చాడు. స్వాములారు ఉత్తరం ఆయన చేతికిచ్చాడు. మెల్లాలో ఉన్న మరో కుర్చీమీద సుభద్ర కూలబడి ఉత్తరం చదువుకున్నాడు. చదువుకుని, కుర్చీలో వెనక్కి ఒరిగి, కళ్లు మూసుకుని,

సుభ—స్వామీ! ఓసి చెప్తాను వినండి. ఇవి న్యాయానికి రోజులు కావండి.

స్వా—కావు నాయనా! బడితెబాజాకి రోజులు!

సుభ—నేను ఓ గొప్ప పొరపాటు చేశాను.

స్వా—(ఏదో తెలియక) చిత్తం అల్లాగేమరి! పొరపాటా, పొరపాటున్నారా! ఏమిటండి?

సుభ—నా యింట్లో పాటూ ఓ డిక్క అద్దెకిచ్చాను. ఆరేళ్ళ నించి వాడు ఉన్నాడు అని కనిపెట్టలేకపోయాను. మా వాళ్ళు వెచ్చతో గ్రహించారు.

స్వా—ఎవడా అద్దెవాడు?

సుభ—ఉన్నాడులెండి, మీరెరగరు. విషధరం.

స్వా—ఏం చేశాడిప్పుడు?

సుభ—నన్నూ, నా వాళ్ళనీన్నీ పత్రికలోనన్నూ, ఏకేసీసిన్నీ దేశదేశాలానన్నూ, నా కీర్తి డాగుచేశాడు.

స్వా—మీ జాతకప్రభావంబట్టి మీకు దేశదేశాలా కీర్తి ఉండడంలో అబ్బరం లేదు. కాని, ఎప్పుడూ మీరు నాతో చెప్పనే లేదే ఆమాటా! ఆ ఉత్తరంలో ఇదేనా మీవాడు రాసింది? చదవండి.

సుభా—(చదువుతాడు) "నాన్నగారికి.— అంతా క్షేమం. మనింటో ఉన్న వివధరం మంచివాడని భ్రమించకండి. అతడు పయోముఖవ్యాఘ్రము.

స్వా—ఇక్కడ రెండు పాతసమాసభాగాలకి వివాహం జరిగి ఉట్టుంది. కానీండి.

సుభ—(చదువును) నాడు తొమ్మిది నెలల కిందట మనకి జరిగిన ఘర్షణ యావత్తూ ఫలానా పత్రికలో రాసేసి, దేశ దేశాలా మనకున్న కీర్తి వాడు నాశనం చేశాడు. ఇంకా నయమే. కొన్నికొన్ని లోగుట్టు సంగతులు ఎక్కించాడు కాదు, మరీ చిక్కుగా ఉండేది. ఈపాటికి ఆ వ్యక్తిని ఇంటోంచి గెంటెయ్యండి. బెంగ పెట్టుకోకండి. తగిన సమాధానం నేను రాస్తాను."

స్వా—ఆపత్రిక ఏమిటో, అసలు ఆ సంగతి ఏమిటో, మీ పేరెట్టి ఉందో లేదో, ప్రపంచకపు రీతో చూసుకోవద్దూ నాయన్నా!

సుభ—ఇంకా సంశయం ఎందుకయ్యా, మావాడు రాసిం తరవాతా! మావాడి సూక్ష్మబుద్ధి మీరెరుగరు. (సుభార్య కేసి తిరిగి) ఒసే, మన కీర్తి నాశనం అయిపోయిందటే! ...... ఉన్న ప్రతి మూలకీ వెళ్ళి వాడు మన్ని యాగీ పెడుతున్నా

మంటే! (అని వాపోతాడు).

సుభ—భడవా చట్రం అండీ, భడవా చట్రం! ఆరేళ్ళనించీ కళ్ళు పొరగమ్మి చావాలేకపోయాం.

ప్ర—ఆ పత్రిక ఒసారి తెండి, నాయనా!

సుభద్ర కుర్చీమీంచి చివాల్న లేచి, వీధులోకి ఒక్క గంతేశాడు. ఆమూట్టున అతను వీధులో ఈమూలనుంచి ఆ మూలకి ఉన్నట్టుగాటలోకి మళ్లే గాల్ని కన్పించి, కనపడ్డ ప్రతి వాణ్ణీ జబ్బట్టుగుని ఆపి, (స్త్రీలమీద ఆయన చెయ్యి వేసుకో లేదట, అందువల్ల ఆయన కొందరికంటె ధీరుడే!) చాలేసి,:

సుభ—విన్నారా!

ప్రతీవాడు—లేదండి.

సుభ—ఛీ! ఇంకా వినకపోవడం ఏమిటి, మీ మొహం.

ప్ర—రాను రాము! నాకు బొత్తిగా తెలియదండి.

సుభ—తెలియక పోవడం ఏమిటి! మా యింటోనున్నా, అద్దెకున్న లుచ్చా, మామీద రానేసి, దేశ దేశాల్లోనున్నా మాకీర్తి తుడిచేశాడు.

ప్ర—ఎక్కడండి, రాస్తా?

సుభ—ఫలానా పత్రికలో. తెలిసిందా?

ప్ర—నరేలెండి. తెలిసింది. చదువుతాం, జబ్బ వొదలి పెట్టండి

అన్న తరవాతే వాళ్ళని విడుదలచేస్తూ, ఈ రీతిగా కొంత కాలం స్వవిషయప్రాశస్త్యం ప్రతిఫలాపేక్షలేకుండా ప్రచారం

చేసుకుని, అక్కణ్ణించి ఫలానా పత్రికలుండే రెండుమూడు చోట్లకి ఎగిరి ప్రయత్నించిన మీదట అవి ప్రతిచోటా నిండుకోడం విని, మళ్ళీ హాలోలక్షణా అంటూ అద్దెవాడైన విషధరం దగ్గిరికే వచ్చి,

సుభ—(చిరునవ్వుతో) అయితే చూశారండీ! మీరు తొమ్మిది నెల్ల కిందట ఏదో. కాకార్టు. ఆ పత్రిక ఓపినాటు ఇల్లా యిచ్చారండీ, వేరే ఏముంది.

వి—తమకు ఏ నెలది కావాలి! తొమ్మిదినెల్లూ, ముంతెడు నీళ్ళా అంటే ఏమిటి తెలిసేది?

సుభ—సరే లేవయ్యా, మహా! వెటకారం మాటలూ నువ్వూనూ!

అని యింట్లోకి దూకేసి, కుర్చీలో జార్లపడికూచుని, అయన ఆ ఉత్తరం మళ్ళీ గొణుక్కుని, తొమ్మిదినెల్లనాటి బోధచేసుకుని, మళ్ళీ సప్రయాస విషధరం దగ్గిర వాలి,

సుభ—ఈ నెలపత్రిక ఇవ్వండి, పానీ!

వి—చిత్తం. (అని లేచి వెళ్ళి పట్టుకొచ్చి, యిచ్చాడు)

పత్రిక విషధరం చేతులోంచి లాక్కుని, సుభద్ర తూటాలాగ నిష్క్రమించి, మళ్ళీ వెనకటి కుర్చీమీదే అనుకూని, కొన్ని పేజీలు ఇట్టేఅని, ఒక వ్యాసం తీసి, అది తనమీదే అనుకుని, ఆవ్యాసంలో భార్యాభర్తలకి ఉన్న పేర్లు తనకీ తన భార్యకీ అనుకుని, అందులో వాకొక పేరు వ్యాసకర్తదే అనుకుని నిర్ఘాంతపోయి, "నామీదేనర్రోయ్!" అని ఒక్క

రావణా కేకేసి వెనక్కి ఘూర్ణిల్లిపోయాడు. "చిలకా గోరిం కల్లాంటి వాళ్ళకి ఎంతొచ్చిందండీ! రామచంద్ర!" అంటూ మాభార్యగారొచ్చి "ఫరవాలేదు లెండి. లేవండి. ఎవరివల్ల అబద్ధం ఉంటే వార్నే కోసుతుంది. అకుంక తక్కినవాళ్ళ మర్యాదలు మాత్రం ఉ చాడనా మీ ఊహ? చిగురంటూ చూడండి" అంది. సుభద్ర, "ఆది, లుచ్చా!" అంటూ నిష్ఠురంగా లేచి, మా అమ్మని పిలవ్వనా?" అన్నాడు. పిలవకుండానే, సుబ్బమ్మ వచ్చింది. అక్కణ్ణిచూసి, "నాకూ నాభార్యకీ ఇద్దరికీ చెరో రాతపనిచ్చి పెట్టి, తను మంచిపే రెట్టుగుని, మమ్మల్ని విపధరం ఏకేశా డమ్మోయ్!" అంటూ సుభద్ర శోకాలు తీశాడు.

సుబ్బా—అయ్యో! అయ్యో! వీడికేం వచ్చిందట్రోయ్! (అని ఏడ్చి, ఏడుపు ఆపుగుని) చాపపట్రా కోడలా! (అని, చాప వేసింతరవాత) చాపమీద కుదిమట్టంగా కూచుని, హైరాన లేకుండా ఏడవరా నాయ్నా!

అన్న తరవాత, అంతా చాపమీద సర్దుకుని గోల మొదలెట్టారు. స్వాములారు కాఫీ చల్లారపోస్తూనే ఉన్నాడు.

సుభ—అమ్మా! నీ మీదా బాసినట్టే నమ్మోయ్! నువ్వు రాతుసికల్లివిగా మకీ!

సుబ్బా—నామీఁదా! ఓరి వీడి మొహం పాక్కా! నేనెం జేశాన్రా ముసిలి పీనుగునీ! వీడిప్రజ్ఞ తగలేసిరి గదరా, వీడి ప్రజ్ఞ తగలెయ్యా! తనూ, పిల్లలు గలవాడుగదా, ఇంటి

సుట్టు తన కెందుకమ్మా, అడిగేవాళ్ళు లేకగానీ!

సుభ—(కొంచెం సమాళించుగుని) ఏదో పరీక్ష తగులడ్డాము కదా! ఉన్నఊళ్ళో మెతుకుల్లేక, పొట్ట చేత్తో పట్టుగుని, బస్తీకి మొగడి వచ్చాడు. లేనివాణ్ణి రక్షించడమే రక్షించడం. శరణాగతరక్షణానికి మనం పేరుపడివున్నాం. ఈ స్వాక్ష్మి శిలదాచు కుంటూనని నాయింట్లో బాగా అడుగుతున్నాడు, గయుడికి మల్లే. పోనీగదా, అని చెప్పి వీణ్ణి నేను జేరదీస్సినిగదా, చివరికి వీడు నాకే పంగనామాలు పెడుతున్నాడే! తెగ తిని, తిన్నయింటికి వాసాలు లెక్కెట్టి, ఊడగొట్టి పట్టుకుపోయే బాపతు! సంకరజాతి భండాలుడు, తల్లీ తోడూ లేదు.

స్వా—ఆయన కిూయింటో ఊరికేటండీ ఉంటా? ఊరికే జేరి ఇద్దోటా!

సుభ—అబ్బే! అద్దెకే!

స్వా—అంతేగద! అద్దెకి సున్నా చుపతూంటాడా ఏమిటి?

సుభా—ఏమాటకామాటే అనాలి. అద్దె తిన్నగానే యిచ్చేసేస్తారండి. అయితే మాత్రం, నాకు గొప్పసప్పురు పెడతాడా? ఇదా వీడి మర్యాదా! (అని మళ్ళీ ముప్పిణ్ణించి, రాగాలెడుతుంది.)

స్వా—ఆరాత మీాదే అని ఋజువు లేంగేటండి!

సుబ్బామ్మ—నిక్షేపరాయుళ్ళలాంటి వాళ్ళకి రాక్షసపీర్లు అంటించేసిన తరవాత ఇహనేముందయ్యా! నువ్వూ నాకు మల్లేనే చాదస్త్రపు ఘటంలా ఉన్నావ్!

సుభ—ఊరుకోండి, స్వామీ! స్పష్టంగా తెలుస్తూంటేనే!

ఇల్లా గోలచెయ్యడం నించి వీధంట పోయేవాళ్ళు లోపలికి వస్తూండడంవల్ల చిన్న తీర్థం ఏర్పాటైంది. స్వాములారు అప్పుడప్పుడు ఊకొడుతూ కాస్త కాస్తే కాఫీ కతుకుతూ కుర్చీలోనే కూర్చున్నారు. విషధరం, సంగతి యావత్తూ వింటూ తన వాటాలోనే గదిలో ఉన్నాడు. సుభద్ర లేచి, జనాన్ని ఎల్లానో వాయచేసుకుని, వీధులోకి వెళ్ళడానికి దారి నిర్మాణంచేసి స్వాములారితో,

సుభ—స్వాములారూ! ఇంకా చూస్తావేం?

స్వా—కళ్ళుండబట్టి, నాయ్నా!

సుభ—అది కాదోయ్! నువ్వు కాఫీ స్వాములారవని విషధరం నిన్ను పేపర్లో ఘోషించేశాడు. నువ్వు మాకుమల్లే ఇదవాలి, వాణ్ణి ఏదో కాస్త గదమాయించాలి. ఇల్లా ఊరికే కాఫీ పీలుస్తూ కూచుంటే ఏమయినట్టూ! నువ్వు బొత్తిగా కంగారుపడుతూన్నట్టు లేదే?

స్వా—ఎక్కడో ఓ పంక్తి నీ కన్పాయిస్తే, రాసి ఉన్న దంతా నిజూడే అనుకుని నువ్వేమనుస్తూ, కడంవాళ్ళని కుడా ఏడనమనా, నాయ్నా! (అని కాఫీ తాగు తాడు)

సుభ—అల్లాఅయితే, నేను విషధరందగ్గిరికెళ్ళి వాణ్ని నాలుగూ అడగాలి, నువ్వు కుడా వస్తావా రావా?

స్వా—కాఫీ తాగనీండి, నాయ్నా, మీారిచ్చిందేగా!

సుభ—అల్లాయితే, ఏమ!

అని సుభద్ర ఒక్కమాటు విషసరం దగ్గిరికి వెళ్ళిపోతూ, ఓ ఇంటి ఎదట పోగుడ్డ జనంలో ఇద్దరు కొట్టుకుంటూండడం గమనించి, ఆగిపోయాను. వాళ్ళిద్దర్లో ఒకడు సింఘము ఇనస్పెక్టరు రెండోవాడు ఉద్యోగం చేస్తూన్న ఇనస్పెక్టరు:

సింఘనువాడు—ఆ రాత నామీదే!

కడంవాడు—ఛీ! నామీదే! మనోవర్తివాడివ్; నీలో ఏముంది రాయడానికి!

సిం—అందులో తాగుడు విషయం లేదు గనక, ఆ రాత నన్ను గురించే!

కడం—స్త్రీవ్యసనం గురించి ఉంది గనక అక్షరాలా నామీదే! నీమీద ఎల్లా అవుతుంది, ఏశార్థం.

సిం—లంచాల మాట ఉంది గనక నామీదే!

కడం—దిల్లర బాకీలు సంగతి లేదు గనక నామీదే!

సిం—అవకతవకగా ఉంది గనక అచ్చంగా నామీదే!

ఈ దెబ్బలాట చూసేసరికి సుభద్ర కొంతవిచారం తగ్గి, స్వాములారితో,

సుభ—చూశావా, స్వాములారూ! నువ్వింకా దొడ్డిదార్నే ఉన్నావ్! వాళ్ళు ఎంతో సూక్ష్మబుద్ధి ప్రయోగించి తమ సంగతి ఎక్కడెక్కడ రాసిఉందో అల్లా కనిపెట్టుకుంటూంటే, నీ కామాత్రం బుద్ధే లేదే!

స్వా—నోరు కట్టెయ్ నాయనా, నోరు కట్టెయ్! నువ్వేం మాట్లాడుతున్నావో నువ్వెరగవ్! (అని కాఫీ తాగుతాడు.)

సుభ—(కాంకేసి తిరిగి, అవతలకి నడుస్తూ) అల్లాయితే పోనీ మీరాగండొకా రండయ్యా! వాడిదగ్గిరకెళ్ళి ఈ సంగతి కనుక్కుందాం!

అని విషధరం కేటూరాకి నడిచాము. జనంకూడా అక్కడికి చేరారు.

సుభ—వంటమాస్టరుగారూ! విషధరంగారు! మీకు మా గృహం నచ్చకపోతే ఖాళీ చెయ్యండి. అంతేగాని, మా పాటా గీతు లేదని అక్కడా అక్కడా అనడం ఏం గొప్పది! మారిచెప్పే అద్దెమజ్జులికి, నేను ఎక్కడతేసి హంగులూ చేస్తూ కూర్చోలేను.

వి—మీ పాటా నాకు నచ్చింది. దీన్ని గురించి యాగీ నేను ఎక్కడా చెయ్యలేదు. నాకు హంగులు అవసరం లేదు.

సుభ—ఎవరూ? ఉన్న సంగతి!

వి—ఏదీ? సమాధానం చెప్పండి! ఇంతమందిని ఎందుకూ పిల్చుకొచ్చారు?

సుభ—నువ్వు నామీద రాతలు రాయగలవ్, రాక్షస ప్రెసిడెంట్?

(అని చేతు లాడిస్తూ విషధరంమీదికి వెళతాడు.)

వి—నీమీద ఎవరయ్యా రాసింది!

సుభ—నువ్వే! నువ్వొప్పుడు రాసినా ఎవడి మీదో దెబ్బ!

వి—నీమీద, నే రాశానా? ఏం గర్వంగా ఉంది నీపనీ! నువ్వు మహారాజువనా, గొప్ప లక్షణాలు నీలో ముద్దకట్టిపోయి

ఉన్నాయనా, నువ్వు ఆశ్చర్యప్రాయుకవనా, పోనీ, నువ్వేమన్నా రౌండు టేబిల్ కాన్ఫరెన్సుకి వెళ్ళి వచ్చావనా ?

సుభ—ఓ ! కాఫీహోటల్లో గుండ్రపు బల్లదగ్గిర కొంత మంది ఎరగనివాళ్ళతో చేరి కాఫీ తాగొచ్చాను.

వి—గాసిపంతా నిన్ను గురించే ?

సుభ—ఓ.

వి—అదంతా నిజమే ?

సుభ—ఓ.

వి—అయితే నీకు కోపం ఎందుకూ ?

సుభ—నిజం అంటే, అదంతా నిజమూ కాదు. కొంత అబద్ధం.

వి—అబద్ధం అయితే అసలు నీ కెందుకూ ?

సుభ—ఇంకా వాదిస్తా వేమిట్రా నాతోటి, కొంత నిజం, కొంత అబద్ధం గుచ్చెత్తి నామీద రాసి ?

ఈసమయానికి స్వాములారు కాఫీ పూర్తిచేసివచ్చి,

స్వా—ప్రపంచకపు రీతే అంత, నాయనా, ఆయన్ని ఏం జెయ్యమన్నావ్ !

సుభ—నిజం అయితే మాత్రం పీడేవడయ్యా, నా సంగతి రాయడానికి ! నిజమైన సంగతులు బోలెడు మనం కప్పెట్టు కోడం లేదూ ?

స్వా—అవును, నాయనా, నిజం అయినాసరే, అసభ్యం అయితే మాట్లాడకూడదు, నాకేం అని మాట్లాడితే ఛీఛీ

ప్రయోగం చేస్తారు. నిజం అయినాసరే రాజకీయరీత్యా శాసనం అయితే మాట్లాడనివ్వరుట. నాకేం అని మాట్లాడితే లాటీప్రయోగం చేస్తారు.

సుభ—సరే, అసహకరించారుగాని మీరు వాక్కుండి, వాక్కులయినాగ! ప్రతి సన్యాసి పీనుగూ నాయింట్లో మెయ్యాడమూనూ, శత్రుపక్షం వాదించడమూనూ! నాలో బోలెడు మంచి లక్షణాలు ఉంటూంటె అవి తీసుగు రాయకూడదుటండూ? నన్ను వచ్చి అడిగితే నేచెప్పనూ?

సా—తమ యొక్క మంచిలక్షణాలు తమరి నోటంటగాని జనానికి తెలిసేమార్గం లేదు. సరే, ఇది మీ మొదటి మంచి లక్షణం రాస్తాను

సుభ—లోట్లుపట్టుగు ఏడుస్తావేరా కళ్ళమీద ఈగ వాలినట్టునూ! సాక్షీపని చెయ్యడం అనుకున్నావురా, రాయడం అంటేనూ!

సా—చిత్తం. అంతటి అదృష్టంపడితే జన్మతరించినట్టే అని మహాత్ములు చెప్పలేదూ?

సుభ—నన్నేడిపించి నువ్వు నవ్వుకోవడమూ నీప్రజ్ఞ?

సా—స్వతస్సిద్ధం, శారీరకం అయిన లోట్లుచూస్తే జాలి. స్వార్జితం, మానసికం అయిన లోట్లు చూస్తే సరదా.

సుభ—ఇహ నామీద రాశావంటే, జాగ్రత్త.

సా—నీమీద ఎన్నడూ రాయను. మనుష్యుల మీద రాస్తాను.

సుభ—అసలు నాకు కోపం వచ్చిందంటే, మనిషినిగాను.

వి—కోపం రానప్పుడూ అంతేలా కనపడుతున్నారు. పోనీ, కీర్తినష్టానికి దావా తెచ్చుకోండి! (అని దగ్గిరికెళ్ళి గట్టిగా అంటాడు)

స్వా—ముందుమాట, కీర్తి ఉన్నతరవాతేగా, నష్టం రావడానికీ!

సుభ—ఒరేయి, స్వాములారు, నన్ను లేచిపో! నాగడప తొక్కకు!

స్వా—చిత్తం. హా శిష్యా! తత్వం సంగ్రహించింగా! సెలవు.

(అని వెళ్ళిపోతాడు.)

సుభ—ఒరేయ్! విషం! విరాదిమీరాన కొస్తున్నావా! పొగరు మోతురకం! నన్ను కొట్టబోతావుట్రా! పైగా నన్ను డిఫర్మేషన్ తెచ్చుగో మంటావురా, భడవా! అయితే నాయిల్లు ఖాళీచెయ్యి! తక్షణం! ఈ ఊళ్ళో నీకు ఇల్లు ఎవడిస్తాడో చూస్తాను!

వి—చిత్తం

విషధరం ఆయిల్లు తక్షణం ఖాళీచేశాడు. అతడికి ఇంకో యిల్లు. ఇప్పించి నాయన్ని చూస్తేకుడా సుభద్రకి కోపం. లోగడ సుభద్ర విషధరం దగ్గిరకూచుని, "మీా దగ్గిర చాలా 'విట్టీ' ఉందండీ!" అని స్తోత్రాలు చేసేవాడు. ఇప్పుడు అతను రాసింది విమర్శించుతూంటాడు. సహజం! అతడు ఒకనాడు

గ్రంథవిమర్శ చేస్తూ (చాలామంది తెలియకుండా కసి వెళ్ళబుచ్చుకుని తద్వారా ఒకవిధమైన ఔన్నత్యం సంపాదించాలని కొందరు విమర్శకులు సంపాదించే పడికట్టు విమర్శ కుప్పలు సుభద్రకుడా కొన్ని జాగ్రత్తచేశాడు!) ఒక ప్రదర్శన గ్రంథంలో "త్రాగా, రసం లేందే!" అని తీర్మానించాడు. (విమర్శ ప్రపంచంలో అతని తీర్మానం వినేవాళ్ళులేరు మరి; ఎన్నింటికని ఇగవం!) మర్నాడు, ఆగ్రంథం రాసింది విషధరం పేరింటిగాడైన మరోకామన అని తెలిసి, ఆయన దగ్గిరికి వెళ్ళి "అయ్యా! ఆగ్రంథం మీాదే అని లోగడ ఎరగను. వాడిననుకున్నాను. మీారని తెలిస్తే నేను దాన్ని మెచ్చుకునే ఉందును" అని సెలవిచ్చాడు. సుభద్ర ఇల్లాగ్గా తనప్రజ్ఞ వాడుతున్నాడు. సుపుత్రుండు రాయదల్చిన సమాధానం తయారుకాలేదు. తక్కిన అంతా క్షేమం. స్వాములారు మరోచోట కాఫీ తాగుతూనే ఉన్నాడు.

ఈముక్కలు నాలుగూ చదువుకుని, ఇది మళ్ళీ "నామీాదేవ్రోయ్!" అని ఘూర్ణిల్లే సుభద్రలు గనక ఎవరేనా ఉంటే ఉండవచ్చు. వారు లేచింతరువాత, వారికి నమోన్నమః.

---

# ధుమాలమ్మ ఓఘాయిత్యం

నాలుగు వేళ్ళూ నోట్లోకి వెళ్ళాలంటే చివరికి రెండు ముక్కలేనా నోట్లో లేకపోతే చిక్కుగదా అనే నమ్మకంతో(ఆనమ్మకం ఇప్పుడు కొంత మరమ్మతు చేయించాలి!) వెనక, నేను నగరంలో యథాశక్తి చదువు చెప్పుకుంటూ ఉండేవాణ్ణి. నగరాయిగ్రామం అవడంచేత, అక్కడ ఒకరి మేడకొట్టు మ్మాట్లాడుకుని, నేను ఒక్కణ్ణే అందులో సుఖాంగా ఉండేవాణ్ణి —ఒంటెత్తుశీనం నాకు అసహ్యం అయినా ఒంటరిగా ఉండడం ఇష్టం చొప్పున. మా మామకి అప్పుళ్ళో ఎదో "వ్యవహారపు పని" ఉండి ఆ రైములో అక్కడికి ఓసారి వచ్చాడు. వచ్చి, సరే, నా కొట్లోనే బసచేశాడు. పూటకూళ్ళ యిట్లోనే మేం మాలితిత్తుచుగునేవాళ్ళం. రోజంతా అతను వ్యవహారం చూసుకుని నిశోయింతరవాత ఇల్లు వెతుక్కుంటూ వచ్చేవాడు. అందుచేత మేం కసిదీరా కబుర్లు చెప్పుగోడానికేనా వీలు లేకపోయింది. ఒకనాడు పొద్దున్న స్నానాదికం అయింతరవాత అతను "మరి పని పూర్తి అయింది. వెడతాన్రా" అన్నాడు. "సరేలే మునిగిపోలేదు, ఉండవోయ్!" అన్నాను. అతను. "అల్లా కాదురా!" అన్నాడు. "అయితే, మంచిమాట చేసుకుని, పదిగంటలరైల్లో కొట్టెద్దుగాన్లే" అని అతన్ని ఆవుచేశాను. నేను నా చిన్న కుర్చీమీద కూచున్నాను, అతను పెట్టె సర్దడం మానేసి పడక కుర్చీలో వెన్నువాల్చాడు. "మళ్ళీ

ఎన్నాళ్ళకో కలుసుగోడం, ఏమన్నా మాట్లాడుకోవచ్చని ఆగమన్నాను, మామా!" అన్నాను. అని కొంత సేపు మా సంసారపు గొడవలు స్మరించుగున్నాం. "ఏముటో ఇల్లానే ఉంటూ ఉంటుందిరా! ఏం జరగవలసి ఉందో! కానీ!" దగ్గిరికి వచ్చాం.

అతను—సరేగాని, అన్నట్టు జ్ఞాపకం వచ్చింది, ఈయిం ట్లావిడ పేరేమిటి?

నేను:—ధుమ్మాలమ్మగారు.

అ—నేను ఇందాకా నూతి దగ్గిరికి వెళ్ళినప్పుడు, ధుమాలమ్మగారి చెయ్యిపట్టుగుని నూతికి ఎడంగా లాక్కెడు తున్నాడు, ఆవిడ ముగుడా? అంతే అయి ఉంటుంది.

నే—మ్మరే మామా. మామూలే. ఆయన పేరు వరప్ప. ఆవిడ నూతులో పడతానని బెదిరిస్తూన్నప్పుడల్లా ఆయన అల్లా బతిమాలుకుని ఆవిణ్ణి వెనక్కి లాక్కెళుతూంటాడట.

అ—కారణం?

నే—బ్రహ్మకి తెలియాలి. వాళ్ళకి పడమట. అనుదినం వష్టాష్టకం పోరు!

అ—ఆమాత్రం పడకపోడం, పోరూ, ఎక్కడ పడితే అక్కడ ఉంటాయి. ఇంట్లో పిల్ల ఒక ర్తున్నట్టుంది, ఆపిల్లెవరు? కూతురా?

నే—ఆవిడ పేరు మణెమ్మ. ఆవిడ ధుమాలమ్మగారి చెల్లెలి కూతురుట. వీరు దగ్గిరికితీసుకుని పెళ్ళి చేరంటం జరిపారు.

అ—అది నరప్పకి అట్టే ఇష్టంలేదేమో !

నే—అవునే విన్నాను, నేను. తన తమ్ముడ్ని కొడుకుని తమరు పెంచుకుని ఉండవలసిందని ఆయన ఊహట.

అ—ఇంకేం ? ఆమాట ధుమాలమ్మకి కిట్టదన్నమాట !

నే—ఎల్లా కిట్టుతుందీ, ఆస్తి ఆవిడ పేరనే ఉన్నప్పుడూ!

అ—నరప్ప కేవలం ధన్యా అన్నమాట ?

నే—నఖశిఖపర్యంతం! అంచేత, తణాకాలూ తాకట్లూ చూసుగోడాని కయితేం, పొలాలమీాది కెళ్ళి అయివేజీలూ అంబారాలూ నొల్లుకుని ఇంటో వేసుగోడాని కయితేం, మంచికయితేం, చెడ్డకయితేం వీధులో పనీ ఇంటోపనీ అన్నీ ఆవిడ అహోరించుగోవలిసిందేగాని, ఆయున నూదికపుల్లంత సాయితాకూడా లేదుట. అందుకనే, ఆయున్ని—శాస్త్రం చెప్పిన తరహాయిగా— ధుమాలమ్మ పెనిమిటి అంటే తప్ప ఎవ్వరూ ఎరగరు. అతనికి పొడుం పీల్చడంలో ఉండే రకాలు మాత్రం తుణ్ణంగా వచ్చుట. ఆ రకాలన్నీ అతని మొహం మిాదే చూడచ్చు.

అ—పాపం! అమాయికుడు రోజూ ఆవిణ్ణి బతిమాల్తాడే! రోజూ పడతాననేది ఎన్నటికీ పడదని ఎరగడు.

నే—నేనూ అదే చూస్తున్నాను, మామా. నాకు ఇక్కణ్ణించి మరోచోటికి చపాయించెయ్యాలని ఉంది. ఆవిడ నూతులో పడాలని అడుగో ఇదుగో అని అర్నెల్లనించి పట్టుట. వెనక వీళ్ళింటో మయ్యా, పడటానికి

ఎంతమాత్రం వీల్లైంది కాకపోబట్టి అది పూర్తిపించేసి, ఆవిడ ఇప్పుడున్న నుయ్యి దంపించిందని పుకారు. నుయ్యి ఇరుకైపోయి మనిషి ప్రాణాలు మధ్య వార్లోనేపోతే, జలమరణపుణ్యం ప్రాప్తించదని ఆవిడ మతంట.

అ—వెనకటికి ఓ పూర్వాసువాసిని తన ఆడపడుచుమీరావ తట్టుగా లేసుగొచ్చి, తమరి దొడ్లోవున్న వరల నూతిలో దూకబోయి పైనే చిక్కడి ఊరుకుందట— ఒత్తి పొడుం బిరడాలాగ. అప్పుడు, ఎందుకొబ్బరికాయ పెంకు బద్దలకొట్టినట్టు ఆ పైవరలన్నీ బద్దలుకొట్టి ఆవిణ్ణి పిడిపించారట.

నే—వెనక, ఈవిడ చలి అనుకొన్నాళ్ళూ, పట్టుబండలని కొన్నాళ్ళూ, కాలు చీకిందని కొంతకాలం, ముగుడు ఊళ్ళో లేడని కొన్ని రోజులూ జాప్యం చేసిందిట గాని, ఈ మధ్య చాలామంది పరిచయులతో రూఢిగా పడకొనని చెబుతోందిట. పైగా, ఎక్కడా చెప్పద్దని ప్రతివాళ్ళచేతా కేటా ఒట్టుంపుగా చేతులో చెయ్యి వెయించుకుని, ఊరందరితోనూ తనే చెప్పిందిట.

అ—అంతమంది పెద్దల దగ్గిర తనే చేసిన శపథం తను నిలబెట్టుగో లేకపోతే, మళ్ళీ వెళ్ళి వాళ్ళ మొహం ఎల్లాచూడడంఅని ఆవిడ భయం అయివుంటుంది. అదీగాక, వాళ్ళంతా తనని ఎంతమాత్రం స్త్రీత్వంగాని, మాటనిజాయితీగాని లేని వ్యక్తికింధగట్టి తేలిక చేస్తారని ఆవిడ సంకల్పం బహుశా.

నే—ఏమో! ఆవిడ ఎప్పుడో ఓఘాయిత్యం చేస్తుందను-

కుంటూన్ను, మామా.

ఆ—నే అల్లా అనుకోను. ఆయన అల్లా వెనక్కి లాగుతూన్న కొద్దీ ఆవిడ అల్లా ముందుకి సాగుతూంటుంది. లాగుడు లేని సాగుడు ఉండదు, తెగసాగుడు అంతకన్నా ఉండదు. కొందరు దెబ్బలాటల్లో, మధ్యవర్తులు ఆపు చేస్తూన్న కొద్దీ, ఎదటి పార్టీమీద ఎగురుతూంటారు— అవతల్నించి తగిలే దెబ్బలు ఎల్లానూ ఉండవని వాళ్ళకి తెలుసును గనక. అయ్యో, తీర్చినకొద్దీ అప్పులు ఎక్కువ!

నే—నిజమేస్మీ. కొందరు రోగులు ఇంట్లో ఊరుకోమనే వాళ్ళు ఉంటూన్న కొద్దీ మూలుగు అధికం చేస్తూంటారు.

ఆ—అంచేత, ఆవిణ్ణి ఎవరేనా నూతులోకి గెంటాలి గాని, ఆవిడ ఊరకదు, వాదీ పూచీ!

నే—(గడియారం కేసి చూసి) అబ్బో తొమ్మిదింబావు! తువ్వు మరి అగ సన్నావు! హోటలికిపోయి లంఖణం చెడగొడదాం నడు. పట్టుపంచ కట్టుకో! నేను కింది కెళ్ళి కాళ్ళు కడుక్కొస్తాను.

అని, లేచి, నేను అద్దం ఎదట కూచుని కొంచెం ఏదో అభినయించి, పైమీద రుమాలు వేసుగుని, మేడమెట్లు ఓటిదిగి, రెండో దానిమీద పాదం పెట్టేసరికి, దభేలుమని ఊరంత శబ్దం అయింది. నా గుండె గుభేలుమంది. పడ్డది నేనా, మేడా అని పించింది. ఒక్కక్షణం నేను నిశ్చేష్టుణ్ణయిపోయి (అప్పుడప్పుడే చెప్పగున్న సంగతులు స్మరణకి రావడం వల్ల!), నిదానించి,

వెనక్కి తిరిగి చూశాను. మా మామ, "ఆవిడేగా వున్న, మన సంభావణ విన్లేదు కదా!" అన్నాడు, నేను గబగబా కిందికి దిగి దొడ్లోకి పరిగెట్టాను. "మా అమ్మ నూతులో పడ్డదతో హోయ్! వెళ్ళిపోయిందండోయి అని చప్పట్లేస్తూ మణెమ్మగారు ఎంతో ఇదిగా వాపోవడం, ఇటూ అటూ కంగారుగా నడవడం మొదలెట్టింది. నేనూ నూతిదగ్గిరికి వెళ్ళేసరికి అంతట్లో ఎల్లా తెలుస్తుందో, ఇనగేస్తే రాలకుండా హద్దులేని జనం పోగయ్యారు. అంతా కూడా నూతిగోడమీద వాలి నూతిలోకి తొంగిచూస్తున్నారు. ఎక్కడా శబ్దం అన్నమాట లేదు. నూతులో పడ్డ ధుమాలమ్మగారు ఎల్లా కనిపిస్తుంతో చూడాలని నాకూ అనిపించింది, నేను కూడా ఓ కుర్రాణ్ణి దబాయించి కాస్త సందు చేసుగుని, తలమాత్రం నూతిలోకి దూర్చి చూశాను. ఆవిడ మునిగి పోయింది, అక్కడక్కడ బుడగలు వస్తున్నాయి. నేను నా తల బయటికి ఊడలాక్కుని మా మామ ఇంకా దిగలేదేమా అని చూస్తున్నాను. పక్కని మణెమ్మా నరప్పగారూ ఒకర్ని ఒకరు నువ్వే అంటే నువ్వే అని చాలా దీనిగా అనుకుంటున్నారు. ఆపళంగా జనం అంతా ఏకకంఠంతో "ఆఁ" అన్నారు. అదేమిటో అని నేను మళ్ళీ లోపలికి తలపెడితిని గదా, ఆవిడ తేలింది. వచ్చిన వాళ్ళల్లో ఎవళ్ళూ ఏమీ పెంట లేకుండా ఖరాగా చక్కా వచ్చారు—"సిరికిం జెప్పడు" లాగా. ఒకాయన పక్కనున్న పాట్లపాదుకోసం అల్లిన తాళ్ళనార తాడు ఊడలాగి ఆవిడికి అందించబోయ్యాడు. ఆవిడ అవతల

కొన పట్టుగోవాలని యత్నించింది గాని, తాడు పట్టుమీద లేకుండా కుక్కతోకలా వేళ్ళాడ్డంవల్ల ఆవిడకి అదీ పట్టు దొరక్క ఆవిడ మళ్ళీ మునిగి పోయింది. ఈసారి ఆయన తాడు పైకి లాగుకుని దాని చివర ఓ ఇటికబొంత కట్టి "ఈమాటు తేల్తే ఆవిడికి తాడు పట్టంకుతుంది" అంటూ మళ్ళీ వేశాడు. ఆయన అన్నట్టుగానే ఆవిడ మళ్ళీ తేలింది, జనం అంతా "అదుగో" అని ఒక్క కేకేశారు. అవిడికి తాడు దొరికింది. "అమ్మయ్య" అనుకున్నాము అందరూను. కాని ఏం, ఆవిడ కేవలం తన నీళ్ళల్లోనే ఉండి ఆతాడు తగుమాత్రంగా పట్టుగుంటే తీరిపోనా, దానికి వేళ్ళాడ్డం మొదలెట్టిందిగావును. గబ్బిలం లాగ, ఆ వెధవతాడు టుప్పుమని తెగనూనూ, ఆవిడ మళ్ళీ యథాప్రకారం మారోమారని గంగాప్రవేశం అవనూనూ! ఇంతలో మా మామ పట్టుబట్ట పింజెట్టి కట్టుగుని, నను బట్ట లారేసుగునే జనపనారతాడు ఊడదీసి చేత్తో పుచ్చుగుని వచ్చాడు.

నేను—ఇంత సేపాయె, ఏం చేస్తున్నావ్, మామా!

అతను—ఇంత సేపాయె, మీరు ఎంచేశారో అల్లాంటిదే!

అమట్టుగా ఇందాకటి తాడేసినాయన, తనే శ్రమపడుతూ న్నట్టు నలుగురూ అనుకోవాలని, మా మామ చేతులోంచి ఆ జనపనారతాడు దొరకపుచ్చుకుని ఓకొన పట్టుకుని, ఆ తాడు చుట్ట చుట్టపళంగా నూతులో వేశాడు, సరిగ్గా ఆ సమయానికి ఆవిడ పైకి తేలడమేకాక, తాడుచుట్టవెళ్ళి ఆవిడ కంఠానికి

పడింది. అప్పుడు ఆ తాడు పట్టుకుని, ఆవిడ, "అబ్బబ్బబ్బ" అంటూ నూతులోంచి సన్నాయిధ్వనేమో, అది ఫక్తు ఎల్లా ఉండీ, గ్రామఫోనులో "హాహాహా" అనే సవ్వస్తేటులా ఉండబోతే సమ్మంధ్య, అంతే!! దాంతోటి, ఆవిడ గ్రామఫోనుకి రికార్డులు ఇవ్వకుండానే, ఇవ్వకపోడంలో ఉండే అపకీర్తి ఆవిడకి తొలగిపోయింది. "వేళ్ళు పట్లొదుల్తున్నాయండోయ్, ఇక నేను ఆగలేను, ఈ వేళ తాడేనా గట్టిదేనా కాస్తంత!" అని ఆవిడ అరచింది. ఏమిటి అంటే ఏమిటి ధరి అన్నారు కొందరు. ఇంతలో ఒక సూక్ష్మబుద్ధి నూతులో ఒకసారి పైనుంచి కిందకి కొంతకొంత ఎడంగా మెట్లుండడం కనిపెట్టి అల్లాంటి మెట్టుమరోటి సిటిమట్టానికి కిందకూడా ఉండి తీరుతుందని ఊహించి, తాడేసి నాయన చేతులోంచి కొన ఊడిపుచ్చుగుని, మెల్లిగా తను ఆ మెట్లున్న పక్కకి జరిగి ఆవిణ్ణి అక్కడికి తీర్చాడు. అప్పుడావిడకి ఆ మెట్టు, పాదానికి గోచరించి, ఆవిడ దానిమీద చాలా బరువు ఆనేటట్టు ఒక పాదంమీద నుంచుని తూలిపోకుండా గాస్త్రం తాడు పట్టుగుంది. జనానికి మనస్సు కొంతకొంత కుదటపడింది. ఇహ నావిడ పెల్లగిలి పైకిరావడం మాట!

ఒకడు—ఇప్పుడు లోపలికి ఓ కుర్చీ పంపిస్తే!

ఇంకోడు—వడిసినట్టే ఉంది, ఆవిడ అందులో కూర్చోడం ఎల్లా!

మరోడు—ఓ మేనాలాంటిది దింపితే!

నేను—మీపుణ్యమాయిరి, నిమ్మళంగా మాట్లాడండి.

కాడేసినాయన—ఆవిడ పుణ్యస్త్రీ గనక జుట్టుకి గాలం వేస్తే; ప్రాణం దక్కేటప్పుడు కాస్త గీసుకుపోవడం లెఖ్ఖాపత్రం ఏమిటన్నాను!

జుట్టుచూసి నాయన—నిచ్చెన దింపాలండి! తెలియకుండా చెబుతారేం!

సరప్ప—(తనకుడా నూతులో తలపెట్టి) నీకు పిచ్చి కోపంగాని, నేనుమాత్రం ఏమన్నానే! నిచ్చెనేస్తారు ఎక్కు చక్కగా.

భు—మళ్ళీ నా నెత్తిమీదికి నిచ్చెకో ఎందుకయ్యా! నిచ్చెనా నీ మొదమూనూ! నేను ఛస్తానంటే, చావనివ్వరేం! బాబూ మీరంతా వెళ్ళిపొండి. నేను ఊతం బలవంతంచేసుగుని ప్రాణం వొదుల్తాను. మళ్ళా మునుగుతాను. నాలుగు గుక్కలు తాగుతాను. ఛస్తాను తీరిపోతుంది.

ప—(ఎడంచేతులో పాదం వేసుగుంటూ)నిచ్చెన వెయ్యండి! మహాచక్కగా వస్తుంది పెళ్ళికూతుర్లాగా!

భు—ఒరి వీడి పెళ్ళి పేలాలు వేగా! వీడిమొహం తగలెట్టా! కాపరానికి వచ్చినప్పణ్ణించి చూస్తాను, ఏకకోత ఉంపంకోత! పుస్తె ముడేసినప్పణ్ణించి చూస్తాను, ఏకతిట్లు వీడితిట్లు నేలవడ! వేపించుకు తినేస్తున్నాడు మరీను! ఎన్నాళ్ళని ఎన్నాళ్ళని! ఒకరోజా రొండురోజులూనా! మొగుడైతేమాత్రం, వెధవ మొగుడు! ఇంత అన్యాయమా! హావ్వ! ఒళ్లు మండుకొస్తుంది!

న—(చేతులో పాడుంయావత్తూ కుడి రంధ్రంద్వారానే పీల్చి) నువ్వు నీళ్ళల్లో మండేజ్యోతివే! కాని, మొగుణ్ణి తిడుతున్నావ్, అనుభవిస్తావ్ లే!

ధు—అయ్యా, వింటున్నారా? మొగుడయేది, వారయేది, పేరయేది, నాది యింకోరిచేత మాటపడే ఘటంకాదు! మరే! చెప్పద్దూ! మానంశం మహా అభిమానం గలవంశం. అందులో నాకు మహారోషం. మంచికి మంచిదాన్నే గాని, ఆజ్ఞలూ అధికారాలూ నాదగ్గిరసాగవ్!

న—(సకిలించి, చప్పరించి) నీరోషం ఉక్కు రోషం! నాకు మల్లే ప్రపంచం అంతా వచ్చి నీకు కైవారం చేస్తారనుకున్నావేం?

ధు—వాడు మాట్లాడితే నేను మళ్ళీ పడతానా! ఇంకా నాజన్మందుకా!

మరెమ్మ—అమ్మోయ్!

ధు—ఓయ్! ఏంతల్లీ!

మ—మరేం,

ధు—ఊం

మ—నువ్వు చచ్చిపోవద్దేవ్! పోతే నాకు భయమేవ్! (అని ఏడుస్తుంది.)

ధు—భయమా. అమ్మా! మామ్మే (అనిఏడుస్తుంది.)

మ—నువ్వుపోతే నేనూ పోతాను!

ధు—అమ్మా, అమ్మా! నేనందుకు ఒప్పుతానా! అందులో

నువ్వు ఉత్తదాసవా? నేను రెండు పాపాలు కూడా ఎక్కడ చుట్టుగోను మెడకి! అందుకోసమేనా వస్తాన్లేఅన్నా! చచ్చి పోన్లే పడవకు.

(అని తనలో)- ఏదో ఇంతసుభ్భరంగా అయినకాడికి పద్దా మన్నా పీల్లేకొచ్చిందిగదా ఈపిల్లమూలంగానూ! నే లేకపోతే ఈవెఱ్ఱి బాగుల్ది బొత్తిగా బేజారెత్తిపోతుందిగదా ఖర్మం!

ఈసరికి తాడూ నిచ్చెనా తెచ్చి, నిచ్చెన మెట్టుకి తాడు ముడేసి, నూతిమీదికి ఓ దూలం తెచ్చి వేసి, దానిమీద ఇటో ఇద్దరూ, అటో ఇద్దరూ పరాధ్యానం లేకుండా పీఠం వేసిన తరవాత, దానిమీంచి నిచ్చెన దింపారు. అప్పుడు మా మామ మెట్లుచూపిన ఆయనతో "అయ్యా, తమరే అవిణ్ణి బ్రతికించారు గనక, పూర్తిగా ఉద్ధరిస్తే బాగుంటుంది" అన్నాడు. ఆయనా దిగడానికి చొక్కాగ్రాతీసి, బట్టబిగించి కట్టుగున్నాడు. అప్పుడు సరప్ప, తన పొడుంకాయకున్న బిరడా తిప్పుతూ "సిగ్గూ శరం ఉండాలి, ఎదురుగుండా కొండంత మొగుడు, చుట్టూ బోలెడుజనం, పగలు, పరాయిస్త్రీమీద చెయ్యి వెయ్యటానికి తయారవడమా! అందులోనూ, నూతిలో ఇరుకుగా ఉండకమానదు, జనం ఓరి కోరు తగలక మానదు, అదే చాలని తెగించేవాళ్ళు కొందరూ! ఛీ!" అన్నాడు.

అందరికీ పోదామా అనిపించింది.

కాని, మామామ నాకేసి కన్నుగలిపి సరప్పగారి రెక్కట్టుగుని, నాతో "పట్టూ" అన్నాడు. నాకూ స్ఫురించింది.

మేం ఇద్దరం, ఆయన్ని గంజీకావిడేసి, ఎగరేసి నూతులో వేళ్ళాడుతూన్న నిచ్చెనమీద వాలింపించి, తాడొదిలేశాం. మావాడు, "నువ్వే వెళ్ళి తీసుకు రావయ్యా ఆవిణ్ణి!" అన్నాడు. నిచ్చెన బరబరా కిందికి వెళ్ళింది. ఆవిడ మళ్ళీ చెలరేగింది. "స్వర్గానికెళ్ళినా, జన్మాంతరంలోనూ, వీడేటగాని నాకూ! ఓ మూల కన్నంకీ వాటికీ పాడిలి ధన్నూంటే, ఈ భూతాన్ని నాకలడం ఎంత కర్రా నామీదికి! వేళ్ళుకొంకర్లు పోయాయి, కాలు పట్టు గోలేను, మెట్టుమీదెట్టిన పాదం కొయ్యబారింది, నుంచోలేను. నా ప్రాణాలు పోతున్నాయ్!" అంటూ శోకశేసింది. అయినా సరే, నరప్ప, ఆమాటలు వినిపించుకోక, ఆవిడ ఖాళీ పాదం పట్టుకుని, ఆవిడ కిమ్మనకుండా ఊరుకోడం శుభసూచకం అనుకుని, ఆపాదం తీసిగెళ్ళి నెమ్మదిగా నిచ్చెన మెట్టు మీద పెట్టింది, అక్కడికి తనకి విజయం సిద్ధించిందనుకుని, తనో పెద్ద శృంగార నాయకుడైపోయినట్టు భ్రమించి, చిరునవ్వు నవ్వి, "ఒసేవ్, జలక్రీడ విషయం పోల్చాలన్నా, పాదగ్రహణం గురించి పోల్చాలన్నా, నాకు ఒక్కటే ఉపమానం స్ఫురిస్తోంది" అన్నాడు. మామాను "అమ్మా, అసాధ్యుడే ఈయనా!" అన్నాడు. ఈ వ్యవధిలో ఆవిడ "వక్, టూ, త్రీ" అని ఊపుతీసుకుని, ఆయనవాక్యం పూర్తిచేసిన కాస్సేపటికి, కంగు చెరుగుడిలో మదమతాపు తన్నినట్టు, ఆయన మూతిమీద ఒక్కటిచ్చుకుంది. పాపం నరప్ప దెబ్బతోటి ఉండచుట్టుకుపోయి మూటల్లా నీళ్ళల్లో పడ్డాడు. కొన్ని

వళ్లు ఊడడంచేత కాబోలు నీళ్లు అక్కడక్కడ ఎరు పెక్కాయి. "హారి" అన్నాను నేను. మా మామ "జలక్రీడ రక్తి కట్టిం" దన్నాడు. ఇంతలో సరప్ప తెప్పున తేలి, పైవాళ్ళకి దణ్ణంపెట్టి, నిచ్చెన పట్టుగున్నాడు. ఇదో బ్రహ్మహత్యకుడా మనకెందుకని నిచ్చెన పైకి తోడెయ్యమన్నాం. సరప్పగారు అరుస్తూ గట్టునపడ్డాడు. మేం ఆయనతో మరి మాట్లాడలేదు. మెట్లు చూసి నాయన్ని మానిపించి, తాడేసినాయన తనే దిగాలనుకున్నాడు. కాని, మా మామకి కుడా ఆయన స్వభావం కొంచెం తెలిసినట్లుంది, మెట్లుచూసి నాయన్ని దిగమని మళ్ళీ ప్రార్థించాడు. ఆయన తను పట్టుగున్న తాడు కొన మా మామ చేతికిచ్చి, తను నిచ్చెన ఎక్కి కిందికివెళ్ళి "ధర్మాలమ్మగారూ మీకు దణ్ణం, మీసాటి ఏలోకంలోనూ లేరు, నే బాపూ ఎరుగుదును. దయచేసి నిచ్చెన ఎక్కండి" అన్నాడు. "మీ రంతగా పట్టుపడితే నేను ఏం చెప్పనూ! అల్లాగే! కాని, నిచ్చెనమెట్టు ఘట్టిదేనా? నన్నూ నిచ్చెన్నికూడా ఊడవాలేమో, తాడు, కాస్త జమిలిగా ఉండేది తేకపోయారూ!" అంది ఆవిడ. ఆయన, "ఫర్వాలేదు ఎక్కండీ!" అని, ఆవిడ ఎక్కేసిన తరవాత ఊరుకోక "ఇంత తాపత్రయంగల ఘటానివి ఎందుకు పడాలమ్మా అసలూ" అని కాస్త పుల్ల విరుపుగా అన్నాడు. అక్కడితోటి, ఆవిడికి మళ్ళీ పూని, ఉక్కురోషం కలిసి, "నాకు వణుకొస్తోందండోయ్, నేను ఆగలేనండోయ్, ఈ నిచ్చెనకి మెట్లు ఏడేనండోయ్! అవి ఏడవడం నాకు అశుభం.

అండోయ్! నన్ను బతికుండగానే చావమన్నార్రండోయ్!" అని గోల ప్రారంభించింది. నూతులో ఆయన "నువ్వే కాదు, అంతా అంతే నోరుమూసుకోవమ్మా!" అన్నాడు. అని ఆవిడ వొదిలిపెట్టిన తాడట్టుకుని ఆవిడ ఇదివరకు నుంచున్న చోట తను నుంచున్నాడు. ఆవిడ గోష లెక్కచెయ్యక నలుగురైదుగురం కలిసి అమాంతంగా నిచ్చెన పైకి లాగబోయాం. ఆవిడకి కోపం మరీ రెచ్చిపోయింది గావును, నిచ్చెన వొదిలిపెట్టి, తాటిపంను వట్టట్టు మళ్ళీ పడింది నీళ్ళల్లో! లాగుతూన్న బరువు అఘాత్తుగా తగ్గడంచేత, లాగేవాళ్ళం మేం అంతా ఓడిమీద పడ్డాం లుంగలు చుట్టుకుని. "ఓ, అదేమిట్రా" అని మా మామ మాకేసిచూసి జాలిపడుతూ తాడుకొస వొదిలెయ్యడం చేత, నూతుల్లో మెట్టుమీద నుంచున్నాయన కూడా నీళ్ళల్లో పడ్డాడు. అప్పుడు మేం లేచి, దులుపుగుని, నిచ్చెన మళ్ళీదింపి, రెండుతాళ్ళు మళ్ళీ వేసి, ఓ తాడట్టుగుని ఆయన్ని నిలబడమని, రెండో తాడుతో ఆవిణ్ణి నిచ్చెనకి అంటగట్టమని కేకేశాం. పాపం ఆయన అల్లానే చేశాడు. నిచ్చెన ఎల్లాగైతేం, పైకి ఈడిచారు. కట్టువిప్పి ఆవిణ్ణి విడిపించారు. తక్షణం ఆవిడ నరప్ప దగ్గిరకెళ్ళి "ఏమకట్ల నిచ్చెనా, నువ్వు తెప్పించావ్, నీతాడుతెగా!" అని ఓతాడుచ్చుగుని అది తెగేటట్టు కొట్టింది. నరప్ప కొంచెం పాముచేతులో విసుపుగుని, "అబ్బ, ఏమిటదీ, ఊరికేనూ," అని కాస్త కసురుగుని, పళ్ళబాధచేత నోరు మూసుగున్నాడు.

అంతా చక్కాపోయాను. అక్కడికి పదకొండు గంట లయింది. మేం హోటలికి వెళ్ళి ప్రాశన చేశాం. ఆ సాయంత్రం మావాడు వాళ్ళ ఊరు వెళ్ళిపోయాడు. కొంత కాలానికి, ధుమాలమ్మ నూతులో పడడానికి కారణం తెలిసిందా అని నాకు అతను ఉత్తరం రాశాడు. నేను వాసీవాన్ని కనుక్కుంటే చెప్పింది. ఆవిడ మామూలు కోపంలో ఉన్నప్పుడు ఆయన ఒక్కడే బతిమాలుకుంటాడట. విశేషకోపంలో పడ్డప్పుడు, కూతురు కూడా ఓ చెయ్యిపట్టుకుంటుందిట ఆరోజున ఆవిడ నూతి గోడమీంచి నూతిలోకి వాలి ఉండగా, కూతురు ఎడం చెయ్యీ, భర్త కుడిచెయ్యీ పట్టుకుని బతిమాలుతున్నారట. ఆవిడ, ఇద్దరు పట్టుకున్నపుడు చెయ్యవలసిన హంగామా ఎంతుందో అంతా చేస్తోందిట. ఆయనకి విసిగెత్తి "పోన్లే వే, ఇంతకంటె నన్ను చావమన్నావా యేమిటి!'' అని అఘాత్తుగా కుడిచెయ్యి వొదిలేశాట్ట. ఆవిడ, అజాగ్రత్తవల్ల నూతులోకి పిల్లి మంత్రం వేసిందిట. అందుకని, ఆవిడ పడాలని పడకపోయినా, పడాలని పడేవాళ్ళ యశస్సు సునాయాసంగా సంపాదించడమే కాక, పరిచయులదగ్గిర అన్న మాటకి క్రియకనపరిచి, ఆత్మ గౌరవం నిలబెట్టుకుందిట. ఈ సంగతి నేను మావాడికి తెలియ పరిచాను.

సంపూర్ణము

